

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

## సంపాదకవర్గం

సంపాదకుడు:

**కె.వి.గోవిందరావు**
బి.వి.ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

**టి.ఎల్.ఎన్.రావు** బి.ఎస్‌సి.,
**వి.బాలకుమార్** ఎ[illegible].,బి.ఎల్.,

సహాయులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.వి.,బి.కాం.,బి.ఎల్.
కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,
కె.రత్నకుమారి

## చందా వివరాలు

3.సంవత్సరాల చందా.....రూ.100/-
సంవత్సర చందా..........రూ.36/-
ఎయిర్ మెయిల్(1సం॥)... రూ.130/-
సీ మెయిల్(1సం॥)........రూ.75/-

చందా పంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9,వే[illegible]రోడ్,మైలాపూర్,మద్రాస్-600004.
ఫోన్ : 73327

# ఈ సంచికలో

## జనవరి 1991



ముఖ-చిత్రం:
కలర్ టోన్స్ పరెస్సీ
కె.ఆర్.వి.భక్త

**తెలుగు విస్డమ్‌కు ఇది పదవ సంవత్సరం**

# విస్డమ్

## అవార్డుల సభ

1990 డిసెంబరు 14వ తేది
సాయంత్రం గం 5-30 లకు

## రాణిసీతై హాల్

మద్రాసు-600 006

అధ్యక్షులు: హిజ్ ఎక్సలెన్సీ **ఎస్.ఎస్.బర్నాలా**
తమిళనాడు గవర్నరు

తెలుగు ప్రత్యేక సంచిక ఆవిష్కరణ:
మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి
**గౌ॥ పి.ఎస్.మిశ్రా**

(సలహా సంఘ సభ్యులచే విజేతలకు
'విస్డమ్' అవార్డుల బహూకరణ)

## ధ్యానం

### ఆచరణకు పూనుకో



—జేమ్స్ ఎలెన్

మరుగైపోయిన ప్రాతపుంతలలో ఎందుకు తటపటాయిస్తావు? కన్నులకు కనిపించని భావనా ప్రపంచంలో ఎందుకు సంచరిస్తావు? తాత్కాలికాశ్రయం కోసం ఎందుకు ఇన్ని తంటాలు? ఆలంబన కోసం వెతుక్కోడం ఎందుకు? నీలో ఎంతో శక్తి ఉంది. సహజమైన నీ అంతఃశక్తితో వెంటనే ఇప్పుడే ఉత్సాహంతో ఆచరణకు పూనుకో. ఆలశ్యం ఎందుకు? కష్టాలు కనిపించవు. అధైర్యం ఉండదు. నీవు అనుకున్నట్టు ఎంతపైకైనా ఎక్కగలుగుతావు. ఈ క్షణం నీవు ఆచరించవలసినది ఆచరించు. కార్యసిద్ధి కాకపోవడానికి వాయిదాలు వేయడం ముఖ్యకారణం. వాయిదాలు వేయడానికి నీలోశక్తి ఉన్నప్పుడు ఎప్పటి కప్పుడు కార్యాచరణకి కూడా నీలో శక్తి ఉండకపోదు అని గ్రహించు.

(మిగతా 4 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### మర్యాద మనిషిని మనీషిగా మారుస్తుంది

లోకంలో ఎవరికివారే అందరూ మానసికంగా నీతివంతులమని, మర్యాదస్తులమని అనిపించుకోవాలని అనుకుంటారు. ఎప్పటికప్పుడు సాంప్రదాయానికి అనుగుణ్యంగా బట్టలు ధరిస్తారు. అలవాటు లేని క్రొత్త పోకడలతో ఠీవిగా నడవడం నేర్చుకుంటారు. ఏ రోజుకారోజు మారుతూన్న కాలానికి తగినట్టుగా ఉంటారు. అయినా నీతి, నియమం, పెద్ద మనిషితనం వారినుండి తప్పించుకుని మరుగై పోతూంటుంది ఎందుకో?

కట్టిన బట్టలు ముఖ్యం కాదు. నేర్చుకున్న నడక ముఖ్యంకాదు ధర్మబద్ధమైన నీతి, మానవ మర్యాద ముఖ్యం. ఎక్కడ ఉన్నా, ఏ సమయంలోనైనా యోగ్యవంతమైన అసలు మర్యాదలు అభ్యాసం చేసుకోవాలి. వినయ

1991 శుభాకాంక్షలు!

మా పాఠకులకూ, ఏజంట్లకూ, ప్రకటనదారులకూ హార్దికమైన నూతన సంవత్సర శుభాకాంక్షలు.

—సంపాదకుడు

"ఐకమత్యము, సమానత్వం, పరస్పర సహకారం ఉన్నచోట సుఖం, సంతోషం, సౌభాగ్యం ఉంటుంది."

విధేయతలతో సత్ప్రవర్తనను అలవరచుకోవాలి. అవసరమైన వారికి సమయానుకూలంగా సహాకరించడానికి సహజమైన అభిలాష ఉండాలి. ఇదే యోగ్యవంతులైన నీతిపరుల రహస్యం.

నీతి అనేది ఒకప్రత్యేక అవకాశంలో, ఒక ప్రత్యేక వ్యక్తిపట్ల అనుసరింపదగినదిగా ఉండ



కూడదు. నీతి సహజశీలంగా ప్రకాశించాలి. నీతి ఏదో ఫలితాన్ని ఆశించి ముఖస్తుతి కోసం ఆసమయంలో ఆచరింపబడేదిగా ఉండకూడదు. నీతి శీలంతో ఐక్యమై అభివృద్ధి పొందాలి

పై అట్టనుబట్టి కాదు లోపల విషయాన్ని బట్టే గ్రంథం విలువ అన్నట్టు రూపురేఖలు, వేషభాషలు, ధరించిన బట్టలు కావు-సహజమైన మర్యాద, సత్ప్రవర్తన మనిషి విలువను తెలియజేస్తాయి.

మర్యాదలేని అవినీతిపరులను ఎవరూ గౌరవించరు. మానవునికి మర్యాదే ముఖ్యం ఈనాడు లోకమంతా అవినీతిపరులతో, మర్యాద హీనులతో నిండిపోయింది. ఒకరిని దూషించి విమర్శించడానికి పూనుకుంటారు నడతసరిగా లేదని నిందిస్తారు. తమలోపాన్ని తాము తెలుసుకోరు విశిష్టమైన నీతిపరులు చాలా అరుదు

నైతిక ప్రవృత్తిని, మర్యాదను ప్రవృద్ధి చేసుకోడానికి ప్రయత్నించాలి. అవినీతిని అంతరింప చేసుకోవాలి. అసలైన మర్యాదలే మనిషిని మనీషిగా మారుస్తాయి.

## పారిశ్రామిక వ్యర్థపదార్థాల పరిష్కారానికి క్రొత్త సాంకేతిక పద్ధతి

*పారిశ్రామిక వ్యర్థపదార్థాల పరిష్కారానికి జపాన్‌లో ఒక కంపెనీ మట్టిపాములను ఉపయోగించే క్రొత్త సాంకేతిక పద్ధతిని కనిపెట్టింది. పారిశ్రామిక వ్యర్థపదార్థాలను మట్టిపాములకు పెట్టి తినిపించి, ఆ పాముల విసర్జనలను ఎరువుగా ఉపయోగించడం ఈ సాంకేతిక పద్ధతి రహస్యం.*

( 3 వపేజీ తరువాయి)

వెంటనే ఆచరణకి పూనుకో. సమస్తం విజయవంతంగా నెరవేరుతుంది. సౌభాగ్యంతో తులతూగుతూంటావు. నీవు అనుకునేటంత శక్తిహీనుడవుకావు. నీవు, నీ దేహం, నీ ప్రాణం, నీ మనస్సు అంతాశక్తిమయం. ఎప్పటికప్పుడు నీలో ఆత్మశక్తికి ఉద్దీపన కలిగించుకుంటూ ఉత్సాహంతో ప్రస్తుత ధర్మం ఆచరించు నీజన్మ ఒక క్రొత్త జన్మ అవుతుంది.

"ప్రతిఘటన అభివృద్ధికి ఉత్సాహం."

# భారతరత్నాలు

## డా.ఎ.లక్ష్మణస్వామి మొదలియార్

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న కర్నూల్‌కు చెందిన ఒక మధ్య తరగతి కుటుంబంలో 1887 అక్టోబరు 14న జన్మించిన డా. ఆర్కాట్ లక్ష్మణస్వామి మొదలియార్ తండ్రి ఆర్కాటు కుప్పుస్వామి, తల్లి సిద్ధమ్మాళ్. వీరు కర్నూల్‌లోని మునిసిపల్



హైస్కూల్‌లో చదువుకున్నారు. 1902లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు. చిన్నతనంలోనే తలిదండ్రులు మరణించుటవల్ల పెద్ద అన్న దొరైస్వామి వీరిని పెంచారు.

1903లో వీరు మరియు వీరి కవల తమ్ముడు రామస్వామి మద్రాసు జార్జిటౌన్‌లో క్రిస్టియన్ కాలేజీలో చేరారు. ఇక్కడ ఇద్దరూ ఎఫ్.ఎ. (ఆర్ట్స్‌లో మొదటి పరీక్ష) పరీక్షలు ముగించిన తరువాత లక్ష్మణస్వామి వైద్యంలో ఎల్.ఎమ్ & ఎస్ చదవడానికి మద్రాసు మెడికల్ కాలేజీలో చేరారు.

లక్ష్మణస్వామి ఎల్.ఎమ్ & ఎస్ పరీక్ష ముగించి మద్రాసు మెడికల్ సర్వీస్‌లో చేరారు. వీరు మొదట కొన్ని సంవత్సరాలు స్థానిక జిల్లాలలో పనిచేసి 1912 నుంచి మద్రాస్ ఎగ్మూర్ హాస్పిటల్ ఫర్ ఉమెన్ అండ్ చిల్డ్రన్‌లో కొంతకాలం ఉద్యోగం చేసారు. ఉద్యోగ నైపుణ్యానికి, హాస్పిటల్‌లో ప్రదర్శించిన ప్రేమ ఔదర్యాలకు అందరి అభిమాన పాత్రులై మిక్కిలి గౌరవ మర్యాదలను పొందారు.

1914లో వీరు మద్రాసు యూనివర్శిటీలో బి.ఏ పట్టమును, 1922లో ఎమ్ డి పట్టమును పొందారు వెంటనే 'మెటర్నిటీ అండ్ చైల్డ్



"నమ్మకమే మానవుని నడిపించుశక్తి."

కేర్. ఎ నేషనల్ ప్రాబ్లం' అనే సుప్రసిద్ధ గ్రంథాన్ని రచించారు.

ప్రజారంగంలో, విద్యారంగంలో మరియు పరిశోధకరంగంలో డా. లక్ష్మణస్వామి మొదలియార్ ప్రసిద్ధి పొందారు. 1927-28లో బ్రిటన్ మరియు యూరప్‌లో ఆబ్‌స్టెట్రిక్స్ అండ్ గైనకాలజీ మీద ఉపన్యసించుటకు నియోగింపబడ్డారు వీరు 1938లో రచించిన 'క్లినికల్ ఆబ్‌స్టెట్రిక్స్' అనే గ్రంథం అనేకసార్లు పునర్ముద్రింపబడింది ఇప్పటికీ అది ఒక ప్రమాణ గ్రంథంగా పరిగణించబడుతూంది

1934 నుండి వీరు మద్రాసు మెడికల్ కాలేజీలో ఆబ్‌స్టెట్రిక్స్ అండ్ గైనకాలజీ ప్రొఫెసర్‌గా పనిచేసారు 1939లో అదే కాలేజీకి మొట్ట మొదటి భారతీయ ప్రిన్సిపాల్‌గానూ, హాస్పిటల్ ఫర్ వుమెన్‌కి సూపరింటెండెంటుగాను నియమింపబడ్డారు 1941లో అమెరికన్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్ ఫెలోగా ఎన్నుకోబడ్డారు. ఈ పదవికి వీరే మొట్టమొదటి భారతీయులు 1948లో వీరు ఇంటర్ యునివర్సిటీ బోర్డ్‌కి అధ్యక్షపదవిని అలంకరించి సెకండరీ ఎడ్యుకేషన్ గురించి రిపోర్టు తయారు చేసారు.

డా. లక్ష్మణస్వామి మొదలియార్ ఇండియన్ మెడికల్ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ మరియు ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చి సంస్థలతో వీరికి సన్నిహిత సంబంధం ఉంది. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో హెల్త్ సర్వే అండ్ డెవలప్‌మెంట్ కమిటీ ఛైర్మన్‌గా ఎన్నుకోబడ్డారు. వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ ఎగ్జిక్యూటివ్ బోర్డుకి మరియు యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్, సైంటిఫిక్ అండ్ కల్చురల్ ఆర్గనైజేషన్ (UNESCO) కి ఛైర్మన్ పదవిని అధిష్టించారు

గైనకాలజీ విభాగంలో గొప్ప నిపుణులుగా అంతర్జాతీయ ఖ్యాతిని పొందారు వీరు ఈ రంగంలో అపూర్వసేవకు భారతదేశంలోనూ

## చైనీయులకు మోటారుకార్లు

చైనాలో 1000 మిలియనుకు పైబడిన జనాభాకి నాలుగు మిలియను మోటారు వాహనాలు మాత్రమే ఉన్నాయి. వీటిలో ఒక మిలియను కార్లు.

— 'జర్మన్ పేపర్స్' సౌజన్యంతో

## హృదయంలో బంధం



BABU RAJENDRA PRASAD

*ఊపిరి సలపని జీవితం భరించడానికి హృదయంలో బంధం బలిష్టంగా ఉండాలి ఈ బంధం మెదడులో కంటే హృదయంలో నిష్కళంకమైన పవిత్ర ప్రేమ నుండి జవసత్వాలను కలిగించుకుంటుంది ఇది ప్రతిఫలం ఆశించని ఉదారప్రేమ. నియమాలు, నిబంధనలు లేని అనంత ప్రేమ మానవుణ్ణి మౌనక్షేత్రం నుంచి దివ్యక్షేత్రానికి తీసుకుపోగల ప్రేమ*

—డా రాజేంద్రప్రసాద్, మొట్టమొదటి భారత అధ్యక్షుడు

"ఇతరుల మంచికై చేసే నిజమైన సేవ భగవంతునికి చేయబడు పూజ."

మరియు విదేశాలలోనూ అనేక ప్రముఖుల ప్రశంసలను పొందారు. మద్రాసు యూనివర్సిటీ వైస్-ఛాన్సలర్‌గా ఉన్నత సాంప్రదాయాభి వృద్ధికి కృషిచేసి సహకరించారు. వీరు అంత ర్దృష్టితో పరిశీలించి మానవుల హృదయాలను గ్రహించగల చతురులు. విషయగ్రహణ శక్తి, ధర్మనిరతివల్ల మద్రాసు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ పదవిని ఆగస్టు 1942 నుండి జూలై 1969 వరకు 27 సంవత్సరాల దీర్ఘకాలం దిగ్విజయంగా చేపట్టగలిగారు. భారతదేశం లోనేగాక ప్రపంచంలో యూనివర్సిటీల చరిత్రలో ఇదిగొప్ప రికార్డు. వీరి దీర్ఘకాలపు వైస్ ఛాన్సలర్ పదవీకాలంలో రాష్ట్రంలో విద్య అమోఘంగా అభివృద్ధి పొందింది. అనేకమంది ఉపాధ్యా యులు, విద్యార్థులు విద్యా రంగంలో వీరిని అఖండ ప్రజ్ఞావంతులుగా గౌరవించారు.

రాజకీయరంగంలో కూడా లక్ష్మణస్వామి మొదలియార్ సేవ అత్యంత మహిమాన్వితము. 1952లో వీరు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1969 వరకు ప్రతీసారీ తిరిగి తిరిగి ఎన్నుకోబడ్డారు. కౌన్సిల్ సభలో ప్రతిపక్షనాయకుడుగా ప్రజాపాలిత ప్రభుత్వానికి ఒక వినూత్న స్వాతంత్ర్య సాంప్ర దాయాన్ని నిలబెట్టగలిగారు. ప్రపంచంలో విద్యావంతులందరూ వీరి ఉపన్యాసాలకు ఆశ్చర్యచకితులై పోయేవారు.

డా. లక్ష్మణస్వామి మొదలియారు హిందూ మత సాంప్రదాయానికి చెందినవారు హిందువుగా అన్ని జాతి మతాలను పక్షపాతం లేకుండా అభిమానించారు. డా. మొదలియార్ జీవితాంతం అనేక గౌరవ మర్యాదలను పొందారు. 86వ సం.రం. వయస్సులో 1974 ఏప్రిల్ 15న మరణించారు.

## యుఎస్ఎలో విదేశీ విద్యార్థులు

*యుఎస్ఎలో నూటికి రెండు వంతులు (భారతీయులు కూడా చేరి) విదేశీ విద్యార్థులు మెకానికల్ ఇంజనీరింగ్, కంప్యూటర్ టెక్నాలజీ, బిజినెస్ మానేజిమెంట్ లేక ఫండమెంటల్ రీసెర్చి మొదలైన విషయాలలో నైపుణ్యం సంపాదిస్తున్నారు*

*-'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంటర్నేషనల్ ఎడ్యుకేషన్, న్యూయార్క్' సౌజన్యంతో*

## పక్షుల పట్ల భగవంతుని అపారకరుణ



ఒకరోజున వేట ముగించుకున్న ఆంగ్లేయుడు హైందవ స్నేహితునితో 'ఈ రోజు వేట బాగా లేదు' అన్నాడు దానికి అతడు 'నీవు చాలా బాగా పేల్చావు. కానీ పక్షుల పట్ల భగవంతుని కరుణ అపారం!' అన్నాడు

"ఒక్కసారి ఆత్మపరిశీలన చేసుకుంటే కలిగే జ్ఞానం జీవితంలో పొందిన అనుభవసారంతో సమానం."

# జపాన్ మల్లయుద్ధం - సుమో

బేస్‌బాల్‌తో పాటు జపాన్ దేశస్థులు అధికంగా అభిమానించే ఆట సుమో - జపాన్ దేశపు మల్లయుద్ధం. సుమో జపాన్ సంస్కృతికి, సాంప్రదాయానికి ప్రసిద్ధి పొందింది. దీనికి సంబంధించిన ప్రాచీన విధులు, నియమాలు దీనికొక అపూర్వ గౌరవాన్ని ఆపాదించాయి.



జపాన్ పురాణ శాస్త్రంలో దీని ప్రస్తావన ఉంది. ఇది చాలా పురాతనమైనది. మొట్ట మొదట దేశంలో సమృద్ధిగా పంటలు పండడానికి, ప్రజలు ఆరోగ్యవంతంగా ఉండడానికి పర్వదినాలలోను, ఉత్సవాలలోను శాస్త్రసమ్మతంగా అనుసరించి ఆచరింపబడే క్రీడలే దీనికి ప్రారంభం అని చెప్పుకోవాలి. 8వ శతాబ్దంలో నారా చక్రవర్తి ఆస్థానంలో ఆచరింపబడిన కార్యక్రమంలో సుమో ఒకటి. 18వ శతాబ్దంలో మొట్టమొదటి సుమో అసోసియేషన్ ఏర్పడి నిపుణుల మల్లయుద్ధం ప్రారంభమైంది.

సుమో మల్లయుద్ధం వర్తులాకారపు 'దోహియో' (Dohyo) అనే ఒక రంగస్థలంలో ఆడతారు. దీని వ్యాసం 4.55 మీటర్లు ఉంటుంది. రంగస్థలం పైతలం చాలాగట్టిగా ఉంటుంది.

ఈ ఆట నియమాలు, నిబంధనలు చాలా సులభంగాను సరళంగాను ఉంటాయి. కాళ్ళతో గాక మొట్టమొదట శరీరంలో ఏ భాగంతోనైనా రంగస్థలాన్ని ముట్టిన ఆటగాడుగానీ లేక మొట్ట మొదట రంగస్థలం నుంచి వెలుపలికి త్రోయబడిన ఆటగాడుగాని ఓడినట్టు లెక్క. మల్ల యుద్ధాలు అంతా ఒక్కపట్టులో కొన్ని నిమిషాలలో పూర్తి అయిపోతాయి.

మల్లయుద్ధం చేసే క్రీడాకారుల తలమీద ముడి, అంపైర్ ధరించే ధగధగ మెరిసే దుస్తులు జపాన్ ప్రాచీన సాంప్రదాయాన్ని ప్రదర్శిస్తాయి. టోకియోలో కొకుజికన్ జాతీయ సుమో రంగస్థలం 13,000 చదరపు మీటర్ల వైశాల్యం ఉంటుంది. 11,500 మంది సుమో అభిమాన పాత్రులు కూర్చోడానికి సౌకర్యంగా ఉంటుంది. ఈ ప్రదేశంలో ఒక సుమో మ్యూజియం కూడా ఉంది.

విదేశీ మల్లయుద్ధ వీరులు చాలా మంది సుమో క్రీడాకారులలో చేరారు. వీరంతా యునైటెడ్ స్టేట్స్ మెయిన్ లాండ్, హవాయ్, టోంగా, సమోవా, ఫిలిప్పైన్స్, కొరియా, తైవాన్, అర్జెంటీనా నుంచి వచ్చినవారు. ఈ విధంగా వచ్చిన విదేశీ మల్ల వీరులలో హవాయ్ నుంచి వచ్చిన టకామియామా (Takamiyama) చాలా ప్రఖ్యాతి పొందినవాడు. ఇతడు 1984లో విరమించాడు. కానీ అభిమానులు అందరూ ఇతని ప్రత్యేక విధానాన్ని, పట్టుదలను ఎన్నటికీ మరిచిపోరు.

"దానం చేయడం కంటే
మధురాతి మధురంగా పలకడం మేలు."

# ధనుర్మాసం - సంక్రాంతి పండుగ

సీతారవిచంద్రన్

ఉగాది, శ్రీరామనవమి, దీపావళి, వినాయక చతుర్థి, మొదలైన ఉత్సవదినాలు పండుగలు దేశకాల పరిస్థితులను బట్టి, సాంప్రదాయాన్ని బట్టి ఇటువంటి పండుగలు మనం ఎన్నెన్నో చేసుకుంటాము. ఈపండుగ లన్నిటిలోను ముఖ్యమైనది సంక్రాంతి పండుగ. ఇది మనకు పెద్దపండుగ।



సంక్రాంతి పండుగ మార్గశిర పుష్యమాసాలలో వస్తుంది. అంటే సాధారణంగా జనవరి రెండవ వారంలో వస్తుంది. దీనిని మకర సంక్రాంతి అనికూడా అంటారు. మేషం, వృషభం, మిధునం మొదలైన 12 రాశులలో సూర్యుడు ఒకరాశినుంచి మరోరాశిలో ప్రవేశించడం సంక్రాంతి లేక సంక్రమణం. ఈవిధంగా సూర్యుడు ఒక్కొక్కరాశిలోనూ ప్రవేశించినప్పుడు ఒక్కొక్క సంక్రాంతి ఏర్పడుతుంది. కాబట్టి మనకి 12 సంక్రమణాలు ఏర్పడతాయి. కానీ సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినప్పుడు ఏర్పడే సంక్రాంతే మనం పండుగ చేసుకుంటాము. ఇదే మకర సంక్రాంతి.

మకర సంక్రాంతి నుంచి ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమవుతుంది. చలి వెనుక బడుతుంది.ఆకులురాలి చెట్లు చిగురించి శోభిస్తాయి. ప్రకృతి అంతా రమణీయంగా ఉంటుంది. రైతులు పెట్టుబడిపెట్టి ఎండనక, వాననక ఓర్చి కష్టించి పండించిన పైర్లు పుష్కలంగా పండుతాయి. జీవితంలో ఒకక్రొత్త మార్పు ఏర్పడుతుంది. అందుకే ఇది మనకు పెద్ద పండుగ అయింది. సంక్రాంతి పండుగకు ముందు నెలరోజులు సూర్యుడు ధనుస్సు(రాశి)లో ఉంటాడు. ఈనెలరోజులూ మనకు పండుగ రోజులే. సూర్యుడు ధనుస్సులో ప్రవేశించినది

## మేధాశక్తి

[illegible]

—[illegible]

## పాలరాతి మీద ధర్మశాస్త్రం

*బర్మా మాండలే రోడ్డు మీద ఒక మైలు పొడవు కుతో డా(Kutho Daw) అనే గ్రంధం పాలరాతి మీద వ్రాయబడిన ధర్మశాస్త్రం. యుఖాంటి అనే బౌద్ధ భిక్షువు వ్రాసిన ఈ గ్రంధంలో 728 పుటలు ఉంటాయి ప్రతీపుట ఒకరాతి పలక, ఒకటన్ను భారం తూగుతుంది. పాలీ భాషలో పైనుంచి క్రిందికి చెక్కబడి ఉంటుంది.*

"ప్రతిఫలం ఆశించకుండా చేసే మేలు
మహాసముద్రం కంటే గొప్పది." —తిరుక్కురళ్

మొదలు మకరరాశిలో ప్రవేశించేవరకూ ప్రతీ రోజూ ఇళ్లముందు శుభ్ర పరచి పేడనీళ్లు జల్లి ఊడ్చి వింతవింత రంగు ముగ్గులు పెడతారు. ముగ్గులు గృహాలంకరణలో ముఖ్యస్థానం అలంకరించాయి. ఈముగ్గులు ప్రతీరోజూ ఇంటి వీధిగుమ్మాలలో చిత్రిస్తారు. ముఖ్యంగా ధనుర్మాసం నెలరోజులూ విచ్చలవిడిగా ముగ్గులతో అలంకరిస్తారు అప్పుడు ప్రతీఇల్లు



ఒక చిత్రశాలగానే కనిపిస్తుంది. ప్రతీగృహిణి ఒక చిత్రకారిణిగానే కనిపిస్తుంది. మగువలకిది ముగ్గుల పండుగ - స్త్రీలు ముగ్గులు తీర్చడంలో తమహస్తకళానైపుణ్యాన్ని ప్రదర్శించుకోడానికి ఇది ఒక అపూర్వ అవకాశం.

బాలికలకిది గొబ్బిపండుగ. ఆడపిల్లలు పెరటిలో ముగ్గులుతీర్చి ఆముగ్గుపైన అయిదు పేడముద్దలు ఉంచి పైన బంతిపువ్వులు గుచ్చిపసుపుకుంకుమలతో పూజించి గొబ్బెమ్మలను పెడతారు. ఈగొబ్బెమ్మలచుట్టూ తిరుగుతూ చేతులు తడుతూ పాటలు పాడతారు.

ఇళ్లు వాకిళ్లు దులిపి వెల్లవేయిస్తారు. గుమ్మాలకు పసుపురాసి ముత్యాలవంటి ఎరుపు, తెలుపు చుక్కలు పెట్టి సింహద్వారాలకు బంతిపూదండలు, మామిడి ఆకుతోరణాలు కట్టి అలంకరిస్తారు ఇదంతా మకరసంక్రాంతికి ఆహ్వానమా అనిపిస్తుంది.

దాసర్లు, భక్తులు ప్రొద్దున్నే భజనగోష్టులతో నాలుగువీధులు చుట్టివస్తారు. దేవాలయాలలో తెల్లవారుఝామునే పూజలు జరుగుతాయి. ప్రతిదినం పొంగలినైవేద్యం చేస్తారు. సంక్రాంతి పండుగ మూడురోజుల పండుగ. మొదటిరోజు భోగిపండుగ. ఆరోజు తెల్లవారు ఝామున ఇంట్లో పాతవస్తువులు, బోగిపిడకలు, ఇతర నిరుపయోగకరమైన వస్తువులు పోగుపెట్టి పెద్దపెద్దమంటలు పెడతారు. వీటినే భోగిమంటలు అంటారు. ఆరోజు పొంగలి వండుకు తింటారు. పిల్లలకు పేరంటంచేసి

## బార్బడోస్ జనసాంద్రత

*ప్రపంచంలో జనసాంద్రత చాలా ఎక్కువగా ఉండే దేశాలలో బార్బడోస్ ఒకటి ఇక్కడ అక్షరాస్యత రేటు కూడా చాలా అధికం. జనాభాలో 97 శాతం అందరూ వ్రాయగలరు, చదువగలరు దాదాపుగా 90 శాతం జనాబా ప్లాంటేషన్స్‌లో పనులు చేసే ఆఫ్రికా నుంచి వచ్చిన బానిస వంశస్థులు*

## తల్లి అని అర్థమిచ్చే మాట 'మ' కారంతో ప్రారంభమవుతుంది!

*ప్రపంచంలో అన్ని భాషలలోను తల్లి అని అర్థమిచ్చే మాట మ కారంతో ప్రారంభమవుతుంది!*

## మొట్టమొదటి తెలుగుటాకీ 1931 లో తీయబడింది

*మొట్టమొదటి తెలుగుటాకీ (భక్తప్రహ్లాద) 1931 లో తీయబడింది సురభికమల మొదలైన వారు నటించిన ఈ ఫిల్మును హెచ్.ఎమ్.రెడ్డి డైరక్టు చేసారు.*

"సచ్ఛీల సంపదగల వ్యక్తికి దారిద్ర్యము అవమాన హేతువు కాదు."

రేగువళ్లు, చెరకుముక్కలు దక్షిణ పెట్టి తలపైపోసి హారతి ఇస్తారు.

రెండవరోజు పండుగ మకర సంక్రాంతి. ఈరోజు చాలా ముఖ్యమైనది. బ్రాహ్మణులకు గుమ్మడికాయ దానం చేస్తారు. పితృదేవతలకు తర్పణాలు విడుస్తారు. నువ్వులు, పంచదార, శనగపప్పు, వేరుశనగపప్పు కలిపి స్త్రీలు ఇంటింటా పంచుకుంటారు. చిన్నవారు పెద్దవారికి నమస్కారాలు చేసి ఆశీర్వాదం పొందుతారు దీనినే మొక్కుల పండుగ అనికూడా అంటారు.

మూడవరోజు పండుగ కనుమ పండుగ. ఇది ముఖ్యంగా రైతుల పండుగ. రైతులు వారివారి పనిముట్లను శుభ్రంచేసి పసుపు, కుంకుమ, గంధం పెట్టి పూజిస్తారు. పశువులను కడిగి అలంకరిస్తారు. పొంగలి నైవేద్యం చేసి ఆరగిస్తారు. పొంగలి మెతుకులు పొలాలలో జల్లుతారు. సాయంకాలం పశువులను అలంకరించి మేళతాళాలతో ఊరేగిస్తారు. ఊరిబయట ఎడ్లపోటీలు, పొట్టేళ్లపందాలు, కోడిపందాలు జరుపుకుంటారు. కనుమ తరువాతి రోజు ముక్కనుమను కూడా కొంతమంది పశువుల పండుగ చేసుకుంటారు.

స్త్రీలు భోగిమొదలు పదిరోజులు బొమ్మల కొలువు పెడతారు. దీనినే సంక్రాంతి కొలువు అంటారు. కొన్నిఇళ్లలో సాంప్రదాయంప్రకారం 'గొబ్బిగౌరీ' వ్రతం చేసుకుంటారు. భోగినాడు అలంకరించిన మంటపంలో మట్టితోగానీ, పసుపుతోగానీ చేసిన గౌరీ విగ్రహాన్ని ఉంచి నిష్ఠగా పూజిస్తారు. నాల్గవరోజున ఉద్వాసన చేస్తారు. ఆరోజు బాలబాలికలు గౌరీదేవిని ఊరేగింపుగా తీసుకువెళ్లి చెరువులలోనో, నదుల లోనో కలుపుతారు. దీనినే వాలాడింపు అంటారు

## ఇక మనుష్యుల వాషింగ్ మెషీన్

బట్టల వాషింగ్ మెషీన్ మనకందరికీ తెలిసినదే కాని జపాన్ టోకియోలో ఒక కంపెనీ కొత్తగా మనుష్యుల వాషింగ్ మెషీన్‌ను అమ్ముతూంది స్నానం చేయదలచినవారు ఆ మెషీనులో తలపైకి పెట్టి కూర్చుంటే చాలు. వేడినీటి ధారలు మనిషిని శుభ్రంగా తోసి కడిగేస్తాయి. ఆ తరువాత అధిక పౌనఃపున్యపు శబ్దంతో కంపిస్తూ చిన్నచిన్న గుండ్రని రబ్బరు ముక్కలు మర్దన చేస్తాయి. ఒక ఇన్‌ఫ్రారెడ్ లాంప్ తడిని ఆరబెట్టేస్తుంది తల, ముఖం మాత్రం మర్దన చేయవు.

## ఎనిమిది సరిక్రొత్త అద్భుతాలు


Laser

* అంతరిక్షయాత్ర
* చంద్రగోళం మీద దిగడం
* గుండెమార్పిడి
* అణుశక్తి
* జెట్ ప్రొపల్షన్
* ఆంటీబయోటిక్స్
* టెలివిజన్
* లేసర్

"పనిచేయడానికి ఆకాంక్ష ఉంటే తగిన మార్గం కనిపిస్తూనే ఉంటుంది."

# యాత్రాస్థలాలు

## కాంచీపురం

కాంచీపురం హిందువులకు ఒకసుప్రసిద్ధ యాత్రాస్థలం. భారతదేశంలో మోక్షదాయకమైన ఏడు యాత్రాస్థలాలలో ఇదిఒకటి.

అయోధ్యా మధురా మాయా
కాశీ కాంచీహ్యవంతికా
పురీ ద్వారావతీచైవ
సప్తైతా మోక్షదాయకాః



అయోధ్య, మధుర, మాయా (హరిద్వారం), కాశీ, కాంచీపురం, అవంతికా (ఉజ్జయినీ), ద్వారకా అనే పుణ్యస్థలాలలో సేవలు చేసిన వారికి మోక్షం సులభం అన్నారు. కాంచీపురం మద్రాసుకు నైరృతి దిక్కుగా 76 కి.మీ ల దూరంలో ఉంది అనేక శతాబ్దాలపాటు పల్లవ రాజులకు ఇది ముఖ్యపట్టణం. చైనాదేశపు యాత్రికుడు హుయాన్‌టిసాంగ్ ఈదివ్యక్షేత్రాన్ని సందర్శించి దాని ఔన్నత్యాన్ని పొగిడాడు కాంచీపురం అనేక విద్యలకు, వివిద కళలకు ముఖ్యకేంద్రంగా ఉండేది ఆదిశంకరాచార్యులు, అప్పర్, సిరుతొండర్, బౌద్ధ బిక్షువులలో ముఖ్యుడైన బోధిధర్మ మొదలైన తాత్త్వికులకు, పండితులకు ఇది వాసస్థానం. హిందూ, బౌద్ధ, జైనమతాలు పరస్పర స్పర్ధలతో తమతమ ఔన్నత్యాన్ని ప్రకటించుకున్నాయి.

600-750 ADలో పల్లవరాజుల సువిశాల సామ్రాజ్యానికి కాంచీపురం ముఖ్యపట్టణం దీనికి చుట్టూ కందకాలు ఏర్పరచి పెద్దపెద్ద ప్రాకారాలు నిర్మించి నగరంలో అనేక దేవాలయాలను స్థాపించారు కాంచీపురంలో సుప్రసిద్ధమైన దేవాలయాలు కొన్నిటిని పల్లవులు నిర్మించారు. మహేంద్రవర్మన్ పల్లవ మరియు మామల్ల నరసింహవర్మన్ (7AD శతాబ్దంలో మామల్లపురం లేక మహబలిపురం స్థాపకుడు) విద్యలను, కళలను పోషించారు అనేక దేవాలయాలను కట్టించారు నేడు కాంచీపురంలో 124 కి తక్కువకాకుండా దేవాలయాలు ఉన్నాయి! మహారాష్ట్ర ఎల్లోరాలో మరియు కర్ణాటకాలో బాదామి రాతి దేవాలయాలను నిర్మించిన శిల్పులకు కాంచీపురం ప్రబోధం కలిగించింది.

**ప్రపంచంలో మిక్కిలి భాగ్యవంతమైన యూనివర్శిటీ**

యుఎస్ఏ మెసాచూసెట్స్ కేంబ్రిడ్జిలో హార్వార్డ్ యూనివర్శిటీ ప్రపంచంలో మిక్కిలి భాగ్యవంతమైన యూనివర్శిటీ. దీని ఎండోమెంట్ల విలువ 621,795,041 డాలర్లు పైబడి ఉంది.

"ఉత్తమశీల నిర్మాణమే జ్ఞానమునకు చరమలక్ష్యం."

—మహాత్మాగాంధీ

కాంచీపురంలో కైలాసనాథ దేవాలయం 1000 సంవత్సరాలనాటి పురాతన శివాలయం ఇది పల్లవుల శిల్పకళతో అలరారుతూంటుంది. పల్లవరాజైన రాజసింహ అతని కుమారుడు మహేంద్రవర్మన్ నిర్మించిన ఈ దేవాలయం ముతక ఇసుకరాతితో నిర్మించబడింది. పైన మరియు క్రింద అధిష్ఠానంలో రాతివలకలను ఏర్పరచారు విమానం నాలుగు అంతస్థుల చతురస్ర నిర్మాణం. పైన అష్టభుజాకారంలో శిఖరం నిర్మించబడింది. ప్రాకారపుగోడ లోతట్టుచుట్టూ 58 చిన్నచిన్న విమానాలు ఉన్నాయి. ఇక్కడ బ్రహ్మా, విష్ణురాతి విగ్రహాలు, అందమైన పెయింటింగులు, సోమస్కంధ



శిల్పములు ఉంటాయి. దేవాలయప్రదేశం ఒకబ్రహ్మాండమైన శిల్పకళావస్తువులు, విగ్రహాలు మరియు ప్రతిమల 'అపూర్వప్రదర్శనశాల.

నందివర్మన్ పల్లవమల్ల నిర్మించిన వైకుంఠనాథ పెరుమాళ్ దేవాలయం గొప్ప విష్ణుక్షేత్రం. ఇదికూడా ఇసుకరాతి నిర్మాణం. పైనక్రింద గ్రానైటుతో నిర్మించబడింది. నాలుగు అంతస్థుల విమానం ఉంది. నాల్గవది తప్ప మిగిలిన మూడు అంతస్థులలోను గర్భగుడులు ఏర్పాటు చేయబడ్డాయి. మొదటిదానిలో నిలిచి ఉన్న విష్ణువు, రెండవదానిలో కూర్చున్న విష్ణువు, మూడవదానిలో శయనించిన విష్ణువు విగ్రహాలు ఉన్నాయి. ఈదేవాలయంలో పల్లవులకు వాతాపి (బాదామి) చాళుక్యులకు జరిగిన యుద్ధాలు శిల్పములుగా తీర్చిదిద్దబడ్డాయి. దేవాలయాలలో సుమారు 8వ శతాబ్దానికి చెందిన పెయింటింగులు హిందువుల కుడ్యచిత్ర నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాయి.



16వ శతాబ్దానికి చెందిన ఏకాంబరనాథ దేవాలయం దక్షిణగోపురం దక్షిణదేశంలో

## నేను ఇంకా జూలియట్ చదవలేదు!

ఒకఫిల్ము జర్నలిస్టు సినీమా నటిని సందర్శించినప్పుడు జరిగిన సంభాషణ:

జర్నలిస్టు:మీరు ఇంగ్లీషు నవలలు చదువుతారా?

నటి:ఓచదువుతాను. చాలానవలలు చదివాను కూడా.

జర్నలిస్టు:అయితే మీరు షేక్స్పియర్ రోమియో అండ్ జూలియట్ చదివారా?

నటి:రోమియో చదివాను. కానీ జూలియట్ ఇంకా చదవలేదు!

-బి.ఎ.విలియమ్స్

"నైతిక బలం భౌతికబలం కంటే అనేకరెట్లు శ్రేష్ఠమైనది."

మిక్కిలి ఎత్తైనది. బ్రహ్మాండమైన ఈగోపురాన్ని రాజగోపురం అంటారు. 10 అంతస్థులతో 57 మీటర్ల ఎత్తుగల ఈగోపురాన్ని 1509-29 లో విజయనగర సామ్రాజ్యాధిపతి అయిన శ్రీకృష్ణ దేవరాయలు నిర్మించారు.

ఇతర చూడదగిన దేవాలయాలలో ముఖ్యాతి ముఖ్యమైనది వరదరాజస్వామి దేవాలయం. కళానైపుణ్యమును చాటుతూన్న 96 స్తంభాల



సభామంటపం చుట్టూ చిన్నచిన్న మంటపాలు అతిరమణీయంగా ఉంటాయి దేవాలయం కళ్యాణమండపంలో వ్రేలాడ దీసిన రాతిగొలుసులు ఆనాటి శిల్పుల శిల్పకళానైపుణ్యాన్ని ప్రతిబింబిస్తూ ఉంటాయి. దేవాలయం ఏడు అంతస్థులతో30 మీటర్ల ఎత్తుగా ఉంటుంది.

కాంచీపురం నాడు, నేడు పట్టుచీరలకు ప్రసిద్ధి చెందింది. ఇళ్లముందర, రోడ్డుప్రక్క రంగురంగుల పట్టునూలు ఆరబెట్టి ఉంటుంది. స్త్రీలు, పురుషులు, పిల్లలు బట్టలు నేస్తూంటారు. కంచిపట్టుచీరలు అనేక డిజైనులలో, రంగులలో ఎంతో సొగసుగా ఉంటాయి

కాంచీపురం దక్షిణరైల్వేలో చెంగల్పట్టు అరక్కోణం సెక్షనులో చెంగల్పట్టుకు 33 కి.మీ.ల దూరంలో ఉంది. మద్రాసు నుంచి కాంచీపురానికి బస్‌సౌకర్యం కూడా ఉంది

# గ్రంథాలు నా ఉత్తమ స్నేహితులు

గ్రంథాలు నా ఉత్తమస్నేహితులు నన్ను ఏదీ ఇమ్మని అవి అడుగవు సరికదా నాకు కావలసిన వన్నీ ఇస్తాయి నా ప్రశ్నలన్నిటికీ సమాధానాలు ఇస్తాయి. ఓర్పులేకపోవడం ఎప్పుడూ లేదు. నిరాశ కలిగించవు. నిరుత్సాహపరచవు. నా తెలివితక్కువతనాన్ని పరిహాసం చేయవు. గ్రంథాలే నా జీవితంలో ఆధారపడి ఉండగల ఉత్తమ స్నేహితులు మహోత్కృష్టమైన ఇంత సేవాసౌకర్యం కలిగిస్తూ అవి కోరుకునేది నాగదిలో ఒక మూల బీరువాలో చోటు

వాల్టెయిర్

# మెదడు నరాల వ్యాధులకు నూతన చికిత్సావిధానం

సోవియెట్ యూనియన్ లాట్వియాలో రిగా మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో మెదడులో ఉండే నరాల వ్యాధులకు ఔషధాల ఉపయోగం లేకుండా ఒక నూతన చికిత్సావిధానం కనిపెట్టారు దీని ప్రకారం అకువంక్చర్ కేంద్రాలలో ఒక లేసర్ మరియు ఒక స్థిర అయస్కాంత క్షేత్రచర్యవల్ల ఆశించిన ఫలితం సులభంగా సాధించబడుతుంది లాట్వియన్ వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు మానవశరీరాన్ని పరిశోధించి శరీరంలో ఇంతవరకూ కనిపెట్టని క్రొత్త ప్రదేశాలను, ప్రత్యేకగుణాలను తెలుసుకున్నారు. వీటిగుండా మెదడు రక్తనాళాలలో రక్తప్రవాహాన్ని నియంత్రిస్తూ నెత్తురును గడ్డకట్టకుండా చేయవచ్చు.

ప్రత్యేకంగా రూపొందించబడిన ఈ సాధనలో తక్కువశక్తి లేసర్ స్పెక్ట్రమ్‌లో (నపవర్ణ పట్టిక) ఎరుపురంగుమీద ప్రవర్తిస్తుంది. ఈ కిరణపుంజము తిరుగుతూన్న చిన్న అయస్కాంతముమీదనుండే ద్వారం ద్వారా ప్రవేశిస్తుంది. సూదుల చికిత్సలాగాక రోగికి ఏబాధా ఉండదు. చర్మానికి అపాయం ఉండదు.

"మౌనం ఎప్పుడూ మాటకంటే ఎక్కువ శక్తివంతం."

# భారత యోగులు

## శ్రీరామానుజాచార్యులు

మతకల్లోలం తీవ్రంగా ఉన్న క్రీ.శ. 11వ శతాబ్దం - శాంకర, శాక్తేయ, పాశుపతాధిమతాలు దేనికదే మానవసంఘాన్ని సంస్కరించి గొప్పగొప్ప ఆచార్యుల సహాయంతో ప్రథమస్థానం పొంద డానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి ఆసమయంలో క్రీ.శ. 1017లో ఆధ్యాత్మిక ప్రబోధ కులు, మతప్రవక్త అగు శ్రీరామానుజులు తమిళనాడులో మద్రాసుకు దగ్గరగా శ్రీ



SRI RAMANUJA

పెరుంబుదూరులో జన్మించారు. అపారదైవ భక్తి, సదాచారసంపత్తిగల ఆసూరి కేశవసోమ యాజి బట్టరు వీరితండ్రి. తల్లి కాంతిమతి.

చిన్నతనంలోనే రామానుజులు తండ్రిని కోల్పోయారు. కాంచీపురంలో వీరి పినతల్లి కుమారుడు గోవిందబట్టరు అనే యాదవ ప్రకాశులు సుప్రసిద్ధ అద్వైత మతభోధకులు శ్రీరామానుజులు వీరివద్ద శిష్యులుగా చేరారు. ప్రతిభావంతులైన రామానుజులు సమకాలీన వివిధ తత్త్వశాస్త్ర విషయాలను పూర్తిగా తెలుసు కున్నారు. అపూర్వమైన మేధాశక్తితో శ్రుతులకు అపార్థం కల్పించిన గురువుగారిని విమర్శించారు. తరువాత శ్రీరామానుజులు కాంచీపురంలో వరదరాజ దేవాలయాచార్యులైన తిరుక్కచ్చి నంబి శిష్యులుగా చేరారు వారివల్ల భక్తి సిద్ధాంతంలో అనేక రహస్యాలను గ్రహించారు.

25వ సంవత్సరం వయస్సులో శ్రీరామాను జులు వివాహం చేసుకుని గృహస్థాశ్రమాన్ని స్వీకరించారు. భార్య సంకుచిత పూర్వాచార

### అంతర్జాతీయ డాక్యుమెంటుగా 'త్యాగయ్య' భద్రపరచబడింది

చిత్తూరు వి.నాగయ్య ప్రఖ్యాత సినీనటుడు, మ్యూజిక్‌డైరెక్టరు మరియు తెలుగు ఫిల్మ్ ప్రొడ్యూసరు. ఇతడి త్యాగయ్య ప్రతి ఒకటి పారిస్ (ఫ్రాన్స్)లో అంతర్జాతీయ డాక్యుమెంటుగా భద్రపరచబడింది.

### కీటక నిరోధక సుగంధద్రవ్యం కనుగొనబడింది

లక్నోలో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ మెడిసినల్ అండ్ ఆరోమేటిక్ ప్లాంట్స్ వారు క్రొత్తగా కనిపెట్టిన సుగంధద్రవ్యం దోమలను, బొద్దింకలను, ఈగలను చేరనీయదు ఈ కీటక నిరోధక ద్రవ్యంలో సువాసన హిమాలయన్‌సీడర్, సెడ్రుస్ డియోడర్‌ల నుండి గ్రహించబడింది.

"కాచిన చెట్టుకు రాళ్లదెబ్బలు."

పరాయణతను సహించక విశాల దృక్పథంతో శ్రీరామానుజులు భార్యను పరిత్యజించి సన్యాసాన్ని స్వీకరించారు. అప్పుడు వారికి 32 సంవత్సరాల వయస్సు.

ఆసమయంలో అపూర్వప్రతిభా పాండిత్యము గల శ్రీరామానుజులు గొప్పపండితుడు వైష్ణవ మతప్రవక్త అగు యామునాచార్యులు (ఆళవందారు) తరువాత శ్రీరంగంలో వైష్ణవమత



ప్రవక్తలుగా వారనులయ్యారు. యామునాచార్యులు తమ గ్రంథములలో వివరించిన ప్రకారం వైష్ణవ సిద్ధాంతాలను, ప్రవృత్తిని తెలుసుకున్నారు.

తనవైష్ణవ సిద్ధాంతాలను మరింత పటిష్ఠవంతం చేయడానికి శ్రీరామానుజులు బోధాయనుని బ్రహ్మసూత్రం భాష్యం బోధాయనవృత్తిని సమగ్రంగా పరిశీలించారు. దీనికై వీరు కాశ్మీరు దేశానికి వెళ్ళి వృత్తి లిఖిత ప్రతిని కూడా సంపాదించారు. బ్రహ్మసూత్ర భాష్యానికి విశిష్టాద్వైత దృష్టితో వ్యాఖ్యానం శ్రీభాష్యం రచించారు. దానిప్రకారం చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు తత్త్వాలు ఉంటాయి. ఈశ్వరుడే పరబ్రహ్మ. చిత్తు జీవాత్మ. అచిత్తు జడజగత్తు బ్రహ్మసత్యమ్ము చిద చిద్రూపమైన జగత్తు అవిద్యాకల్పితం అనే శంకరాద్వైతమును ఖండించారు. చిద చిత్తులు పరబ్రహ్మకు శారీరములను సిద్ధాంతాన్ని సోపపత్తికంగా స్థాపించారు. చిదచిద్విశిష్ఠమైన పరబ్రహ్మ యొక్క అద్వైతాన్ని నిరూపించేది కాబట్టే శ్రీరామానుజులు సిద్ధాంతమునకు విశిష్టాద్వైతము అనేపేరు వచ్చింది.

ఉత్తర భారతదేశం అంతా ప్రయాణం చేసి తనసిద్ధాంతాలను ప్రచారం చేయడానికి ద్వారక (గుజరాత్), పుష్కర్ (రాజస్థాన్), అయోధ్య, బదరీ, గోవర్ధన్ (ఉత్తరప్రదేశ్), తిరుపతి (ఆంధ్రప్రదేశ్)లో శ్రీవైష్ణవ మఠాలను నెలకొల్పారు. అనేకమంది పండితులతో వాదించి, తర్కించి, ఓడించి శిష్యులుగా స్వీకరించారు.

## ఇంట్లో దీపాలకు కోల్‌గ్యాస్ వాడిన మొదటివ్యక్తి

బ్రిటన్‌లో విలియం ముర్‌డాక్ (1754-1839) మొట్టమొదట 1792లో బొగ్గు నుండి లభించే కోల్‌గ్యాస్‌ను రెడ్రూత్ (కార్న్‌వాల్)లో తన ఇంట్లో దీపం వెలిగించడానికి ఉపయోగించాడు.

## గౌరవప్రదమైన బ్రిటన్ సాహిత్య బహుమానం

*క్రిస్టీ నోలాన్ అనే 22 సంవత్సరాల వయస్సుగల ఐరిష్ రచయిత రచించిన 'అండర్ ది ఐ ఆఫ్ ది క్లాక్'కి గౌరవప్రదమైన బ్రిటన్ సాహిత్య బహుమానం ఇవ్వబడింది. ఇతడు మాట్లాడలేడు. నడువలేడు.*

"కలిగిన వారికి అందరూ చుట్టాలే."

78వ సంవత్సరం వయస్సులో తమిళ నాడులో సంచరించుచుండగా శైవ మతాభి లాషులైన చోళచక్రవర్తి కుళోత్తుంగ I వైష్ణవులను శైవమత స్వీకారానికి నిర్బంధించుచున్నారు. ప్రాణాపాయం సంభవిస్తుందనే అభిప్రాయంతో శ్రీరామానుజులు శ్రీరంగంనుంచి కర్ణాటక రాజ్యానికి పారిపోయారు. అచ్చట జైనమతస్థుడైన హొయసలరాజు బిట్టిదేవునిచే వైష్ణవ మతం స్వీకరింపజేసి విష్ణువర్ధనుడు అనేపేరుపెట్టారు. ఇక్కడవీరు 12 సంవత్సరాలకాలం నివసించి మేల్కోటలో ఉన్న తిరునారాయణపురంలో శిథిలమైపోయిన నారాయణ (విష్ణువు) దేవా లయాన్ని జీర్ణోద్ధారణం చేసారు. జాతిమత భేధములను పాటించక అన్నిమతముల వారికి ఆశ్రయమిచ్చిన మొదటి మతసంస్కర్తగా పేరుపొందారు.

1118సం.రం.లో శ్రీరామానుజులు తిరిగి శ్రీరంగం చేరారు. కుళోత్తుంగ చోళుడు చనిపోయాడు. శ్రీరంగంలో శాంతిభద్రతలు ఏర్పడ్డాయి. అచ్చట శిష్యుల సహాయంతో తమ మతప్రచారానికి పూనుకున్నారు. శ్రీరామా నుజులు పర్యాటనకు పూనుకుని ఉత్తరమున, దక్షిణమున ఉన్న అనేక దేవాలయాలను సందర్శించి ఆయాదేవాలయాలలో వైష్ణవమతం ప్రకారం అర్చనా విధానములను ఏర్పరచారు. వైష్ణవ మఠాధిపతిగా శ్రీరంగంలో శ్రీరంగనాథ దేవాలయంలో పూజాక్రమాన్ని నిర్ణయించారు. ఇప్పటికీ కాంచీపురం, తిరుపతి మొదలైన దక్షిణాది దేవాలయాలలో ఈసాంప్రదాయమే అనుసరింపబడుతూంది.

విశిష్టాద్వైత మతప్రచారం నిర్విఘ్నంగా కొన సాగడానికి 74 సింహాసనాలను స్థాపించి శ్రీరామానుజులు తమ శిష్యులలో ముఖ్యులైన 74 మందిని మతసింహాసనాధిపతులుగా నియమించారు.

100 సంవత్సరాలు పూర్ణాయుర్దాయంతో (120 సంవత్సరాలు సాంప్రదాయం ప్రకారం) దేశానికి ఆచారయోగ్యమైన ధర్మాన్ని ప్రతి పాదించి 1137వ సంవత్సరంలో అవతారమును చాలించారు. శ్రీరామానుజులకు అనూరి అనే ఇంటిపేరు ఉండడం బట్టి శ్రీరామానుజులు ఆంధ్రుడని ఒకప్రతీతి ఉంది.

## జీవితం ఒక అద్దం వంటిది



*జీవితం ఇంట్లో గోడకు తగిలించిన అద్దం వంటిది నీవు పొట్టిగా ఉంటే అద్దంలో నీప్రతిబింబం పొట్టిగా కనిపిస్తుంది. నీవు పొడుగ్గా ఉంటే నీ ప్రతిబింబం పొడుగ్గా కనిపిస్తుంది. కోపంగా ఉంటే అందులో నీకోపం కూడా కనిపిస్తుంది ఆనందంగా నవ్వుతూ చూసుకుంటే అదికూడా నిన్నుచూసి నవ్వుతుంది*

*ఆలెన్ డి.మాక్.*

"మోసేవానికి తెలుస్తుంది కావటి బరువు."

# సంభాషణా చాతుర్యం

లోకంలో కొంతమంది తమసంభాషణా చాతుర్యంతో ఎదుటివాళ్లని సంతుష్టిపరచాలని అనుకుంటారు. కానీ అది వాళ్లనుకునేటంత సులభంకాదు. అందరూ ప్రశంసించి మెచ్చుకోవాలంటే క్రిందసూచించిన తొమ్మిది విషయాలను గ్రహించి సందర్భానుసారంగా అవకాశాన్ని బట్టి నేర్పుతో ఉపయోగించుకోండి.



1. స్వగతం మానడానికి ప్రయత్నించు: సంభాషణ అంటే సంవాదం. ఎంతసేపు ఒక్కరే మాట్లాడుతుంటే సంభాషణ వినుగెత్తుతుంది. ఎదుటివారు చిరాకుపడిపోతారు. వాళ్లుకూడా తమ అభిప్రాయాలను చెప్పాలని అనుకుంటారు.

2. అందరికీ పరిచయమైన విషయాలు మాట్లాడు· ఫుట్‌బాల్ ఆడే క్రీడాకారుడితో గణిత శాస్త్రంలో థియిరీ ఆఫ్ నెంబర్స్ గురించి మాట్లాడకు. ఒకరికి అసలు విషయం తెలియదు. ఆటలో నిబంధన అతిక్రమించినట్లు ఆఫ్‌సైడ్ అనిపిస్తుంది.

3. ఎక్కువగావిను: ఎక్కువ వినడానికి ప్రయత్నిస్తే సంభాషణకు సంతోషపడుతున్నామని మాట్లాడేవారు అనుకుంటారు. మాట్లాడే వారికి ఇది మౌనప్రశంస.

4. వక్తకు సహకరించు: సంభాషణ మొదలుపెట్టి గతకాలపు వైభవాలను, విజయాలను జ్ఞాపకం చేస్తూండు. మామూలు సంభాషణలో ఇది ఒకరకం ఉదారమైన దాతృత్వాన్ని తెలియజేస్తుంది.

5. ప్రశంసించు: ఊరికే ముఖస్తుతితో పొగడటం కాదు. వాస్తవంగా మెచ్చుకోదగిన గుణాన్ని ప్రశంసించు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తూ వడివడిగా పరుగెత్తలేని వారికి ఒలింపిక్ పోటీలలో పాల్గొనమంటే ఎలా ఉంటుంది?

## చెట్టు నుంచి మంట

*పిలిప్పీన్స్‌లో చాలా అరుదుగా కనిపించే ఒక అడవి వళ్లచెట్టు ఉంది ఆ చెట్టు నుంచి స్రవించే ద్రవం మంటలను పుట్టిస్తుంది దూరప్రాంతాలలోని గ్రామీణులు ఇప్పటికీ ఈ ద్రవాన్ని లాంతర్లు వెలిగించుకోడానికి వాడుతున్నారు. ఈ ద్రవంతో దేశ ఇంధన అవసరాలు తీర్చుకోవచ్చని ఫిలిప్పీన్స్ శాస్త్రజ్ఞులు భావించి ఈ చెట్టుకుగల శక్తిని పరీక్షిస్తున్నారు చెట్టు వ్రేళ్లనుండి మాను వళ్లలోని గింజల నుంచి ఈ ద్రవం పుడుతుంది*

*బ్రెజిల్‌లో ఇలాంటి చెట్టే డీసెల్‌చెట్టు లేక గుగ్గిలం చెట్టు దీనిలో హైడ్రోకార్బన్‌లో ఉండే లక్షణాలన్నీ ఉన్నాయి. ఫిలిప్పీన్ ఇంధనచెట్టు వర్గీకరణ గురించి వృక్షశాస్త్రజ్ఞులు పరిశీలనలు జరుపుతున్నారు. బ్రెజిల్ చెట్టుమాదిరిగానే ఇదికూడా యుఫోర్బియా లేక జెముడు వర్గానికి చెందిన చెట్టు. ఈ చెట్టుకాయలు పండి పక్వానికి వచ్చి అవి పగిలి వాటి గింజలు నేలకు కొట్టుకున్నప్పుడు అందులోనుంచి మంటలేవడం గమనించారు.*

"అంత్యనిష్ఠూరం కన్న ఆది నిష్ఠూరం మేలు."

6. అర్థం చేసుకోడానికి ప్రయత్నించు: ఎదుటి వారికోరికలను, అభిలాషలను సాను భూతితో అర్థంచేసుకో సంగీతం అంటే చెవికోసుకునేవాడివి అయితే కర్ణాటక సంగీతం, హిందూస్థానీ సంగీతం, లేకపోతే భరతనాట్యం గురించి తెలిసి అభిమానించే వానితో సరసంగా మాట్లాడగలవు. వ్యక్తి గతంగా వారి ఇష్టమైన భావాలు విశదీక రించాలి. వాళ్లకు ఇష్టమైన విషయాలను చేబట్టాలి.

7 నిందాస్తుతివద్దు: మీస్నేహితుల మనస్సులు అతిసున్నితంగా ఉంటాయి. పైకి పెద్ద నవ్వుతో నీవక్రోక్తులను సంతోషించినట్టు కనిపించినా అంతర్యంగా కోపోద్రేకంతో క్రుంగిపోతూంటారు.

8 ప్రత్యక్షంగా లేనివారిని గౌరవించు: దగ్గర లేనివారిని గౌరవించడం, ఆదరించడం మర్యాద. అక్కడ లేనివారు ఎలాప్రతిపాదిస్తారు? వ్యర్థ ప్రసంగాలను ఎవరు మెచ్చుకుంటారు? ఒకరు లేనప్పుడు వారిని గురించి మాట్లాడ టంలో న్యాయాన్యాయాలు తెలియవు కాబట్టి ఎదుటివారు మెల్లిగా తప్పుకుపోవచ్చు.

9. నీగురించి చెప్పుకోకు: నెమలి పురివిప్పుకుని నాట్యం చేస్తూన్నట్టు తననుగురించి, తన గొప్పలను గురించి మాట్లాడుకునేవారు పనికిరానివక్త. ఎదుటివారుకూడా నీలాగే ప్రారంభిస్తే గొప్పలకోసం ఇద్దరిమధ్యా వివాదం పెరుగుతుంది. ముఖ్యంగా గ్రహించవలసినది ఎవరిగొప్పవారిది. ఎవరికివారే ఎదుటివారిచేత గౌరవింప బడాలనుకుంటారు. ప్రతీవారికీ స్వాభిమానం ముఖ్యం. ఈ రెండు విషయాల మీదే నిబంధనలు ఆధారపడి ఉంటాయి. ●

## ఛేన్ ఇండియన్లు నీరు త్రాగరు

*దక్షిణ అమెరికా పెరుద్వేలో కెయిపిపెండి (Caipipendi) లోయలో రియో పాపాపేటి నది గట్టుమీద నివసించే ఛేన్ ఇండియన్లు మంచినీరు త్రాగరు. ఈ లోయలో నీరు త్రాగడానికి వీలు లేకుండా మడ్డిగా ఉంటుంది. నీటికి బదులుగా వీరు జొన్నలనుండి తయారుచేసిన బీరు త్రాగు తారు*

## ఉద్దీపకమైన స్ఫూర్తికి శక్తివంతమైన ఆధారం



ANANDA COOMARASWAMI

*గత 3000 సంవత్సరాల భారతదేశపు జీవితాన్ని పరిశీలించినప్పుడు దానిసాహిత్యం, సాంప్రదాయం, ఆదర్శాలు, దాని తాత్త్విక ధర్మం, అక్కడి కళాకారులు, వారి కళోపాసన, భారతీయుల సంగీత అభిలాష, వారి ధర్మపరాయణత, గొప్పదనం మొదలైన విషయాలను స్మరిస్తాను ఇటువంటి ఒక ఆదర్శజీవిత చిత్రాన్ని భావించుకున్నప్పుడు ఉద్దీపకమైన స్ఫూర్తికి ఇంతకన్న శక్తివంతమైనది ఇంకొకటిలేదు.*

-ఆనంద కుమారస్వామి

"జ్ఞాని కర్మయోగి కాకపోవచ్చును. కానీ సౌందర్యోపాసకుడు కర్మకుశలుడు కాకతప్పదు."

# నడకవల్ల పొందే లాభాలు

డా.ఓమ్‌ప్రకాష్, MD,DABIM (USA)

సుస్థిరమైన క్రమపద్ధతిలో శరీరాన్ని చురుకుగా ఉంచుకుంటే ఆయుర్దాయం బాగా పెరుగుతుందని హార్వార్డ్ అల్యూమ్ని పరిశోధనలో తేలిన ఫలితాంశం గుండెసంబంధమైన కార్డియో వాస్క్యులర్ మరియు ఊపిరి తిత్తుల వ్యాధులను తగ్గించుట ద్వారా శారీరక వ్యాయామం



శరీరానికి మేలు చేస్తుంది అంతేగాకుండా ప్రాణవాయువు సక్రమంగా శరీరానికి వినియోగమయేటట్లు చేస్తుంది. .

గుండె నిమిషానికి 120సార్లు కొట్టుకునేటట్లుగా సాధారణంగా పెద్దవాళ్లువ్యాయామం చేయాలి. సక్రమమైన నడక, వ్యాయామం గుండెస్థితిని అభివృద్ధి పరుస్తుంది. బాగా స్థూలంగా ఉన్నవారికి శరీరభారాన్ని తగ్గించుకోడానికి ఇది చాలా ముఖ్యం ప్రతీరోజూ క్రమపద్ధతిలో నడిస్తే త్వరగా ముసలితనం రాదు. వృద్ధాప్యం ముంచుకురాదు వేగం తగ్గుతుంది. చాలాదూరం నడుస్తూంటే కండరాల శక్తి అధికమవుతుంది. శరీరం ఆరోగ్యంగా ఉంటుంది.

త్వరత్వరగా నడుస్తూకూడా, ఊగులాడుతూ నడిచేటప్పుడు (jogging) పొందే అధిక గుండెరేటును పొందవచ్చు దీనివల్ల ప్రాణ వాయువు స్థాయిఅవసరప్రమాణంలో ఉంటుంది

నడక, వ్యాయామం ప్రారంభించే ముందు వైద్యుని సంప్రదించడం మంచిది. నడవడానికి ముందు చిన్న చిన్న ఎక్సర్‌సైజులు చేయాలి ఆ తరువాత నడిస్తే ఒక మైలు దూరం నడవగలిగినంత వేగంగా నడిచి నడవగలరా లేదో తెలుసుకోవాలి ఒక మైలు దూరం నడిచిన తరువాత గుండెరేటు లెక్కపెట్టాలి ఉదహరణకి 45 సంవత్సరాల వయస్సు గల వ్యక్తి సామాన్యంగా1 8 నిమిషాలలోఒక మైలు దూరం నడవగలడు.

## పెద్ద పెద్ద నగరాలలో 8 శాతం భారతీయులు ధ్వనికాలుష్య ప్రభావానికి లోనవుతున్నారు

*యు ఎస్ ఎ లో 16 మిలియను మంది వృత్తి వ్యాపారాలలో ధ్వని కాలుష్యాలకు గురిఅవుతున్నారు 40 మిలియను మంది రాకపోకలకు, విశ్రాంతికి నిద్రకు కల్గే ధ్వని అంతరాయంవల్ల బాధపడు తున్నారు. భారతదేశంలో పెద్ద పెద్ద నగరాలలో నివసించే వారిలో8 శాతం మందికి ధ్వని ఆధిక్యత వల్ల కొంతవరకు చెవుడు కూడా సంభవిస్తూంది.*

"శ్రద్ధ ఉంటే నిష్ఠ, నిష్ఠ ఉంటే సిద్ధి ఉంటుంది."

జాగింగ్ కంటే నడవడం మంచిదా? జాగింగ్ వల్ల అకస్మాత్తుగా గుండె జబ్బులు రావడం సామాన్యం. ముఖ్యంగా నీరసంగా ఉండేవారికి. అంతేగాకుండా చీలమండల దగ్గర, మోకాళ్ల దగ్గర ఎముకలతో కూడిన కండరాలకు దెబ్బ తగులుతుంది నడిచేవారిలో ఇటువంటి అపాయానికి ఆస్కారం ఉండదు.

బాగా లావుగా ఉండేవారు నిర్భయంగా ఏ అపాయం లేకుండా క్రమపద్ధతిలో నడవడం వల్ల శరీరభారాన్ని తగ్గించుకోవచ్చు. త్వరత్వరగా నడవడం వల్ల ఆహారపు విలువలు (కాలరీలు) బాగా వినియోగపడతాయి. సాధారణంగా 68 కి గ్రా.లు భారం గల మనిషిలో 45 నిమిషాల నడకవల్ల 250 కాలరీలు వినియోగపడుతున్నాయి. ఇతడే ఏటవాలు ప్రదేశం ఎక్కేటప్పుడు 540 కాలరీలు వినియోగపడతాయి. దీనినే ఇంకో విధంగా పరిశీలిస్తే ఇతడు ఆహారపు అలవాట్లను మార్చుకోకుండా క్రమపద్ధతిలో నడుస్తూంటే ఒక సంవత్సరంలో 9 కి గ్రా.లు భారం తగ్గుతుంది నడక వల్ల శరీరంలో ఉండే క్రొవ్వు మాత్రమే కరిగిపోతుంది అని తెలుసుకోడం ముఖ్యం. ఆహార నియమం వల్ల క్రొవ్వు తగ్గటమే గాక స్థూల శరీరం కూడా తగ్గుతుంది తరువాత పొందే శరీరభారం పూర్తిగా క్రొవ్వువల్లే ఏర్పడుతుంది

అధిక రక్తపు పోటు, సిగరెట్లు త్రాగడం అరికట్టుకోగలిగితే నడకవల్ల రెండోసారి గుండెపోటు రాకుండా నివారించుకోవచ్చు

త్వరత్వరగా నడవడం వల్ల క్రింది శరీర భాగాలలో కండరాల గుంపు క్రమపద్ధతిలో లయబద్ధంగా పనిచేస్తాయి ఊగడం వల్ల శరీరం పైభాగంలో కండరాలకు కూడా విశ్రాంతి ఏర్పడుతుంది. కండరాలు లయబద్ధంగా పనిచేయడం వల్ల కండరాలకు ప్రాణవాయువు సరిపోక పోవడం అంటూ ఉండదు. త్వరత్వరగా నడిచేటప్పుడు బాగా ఎక్కువగా ఊపిరి తీసుకోడం వల్ల ఊపిరి తిత్తులు బాగా విస్తరించుకుంటాయి. తక్కువ ప్రాణవాయువు వినియోగంతో కండరాలు అధిక శక్తిని ఉత్పత్తి చేస్తాయి. సుస్థిరమైన ఆరోగ్యానికి ఇదే కీలకాంశము

-'హెల్త్ ఆక్షన్' సౌజన్యంతో

●

## అంతరిక్ష విజ్ఞానం



ఆస్టిరాయిడ్ సూర్యుని చుట్టూ కుజుడు మరియు గురుగ్రహాల కక్ష్యలలో పరిభ్రమించే వేలకొద్దీ ఉపగ్రహాలు.

మేర్(సముద్రాలు)- చంద్రగోళంలో నల్లని మచ్చలు చంద్రగోళంలో నీరు లేదు కాబట్టి ఈ ప్రదేశాలన్నీ మైదానాలు

న్యూమూన్(అమావాశ్య). చంద్రుని వివిధ కళలలో చీకటివైపు భూమి ప్రక్కకు ఉన్నప్పుడు, భూమినుండి చంద్రుడు కనిపించనప్పుడు

స్పేస్ మెడిసిన్ అంతరిక్షయానాలకు సంబంధించిన మానవుల పరిశీలనకు ప్రత్యేకంగా ఏర్పరచిన వైద్యశాస్త్రం

ఫోటోస్ఫియర్: మనం సామాన్యంగా భూమినుంచి చూడగల సూర్యగోళం పైతలం

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 పంటలమార్పిడి (crop rotation) అంటే ఏమిటి?
(ఎ) భూసారాన్ని పోషించి నిర్వహించడానికి ఒక పంట తరువాత మరోపంటను క్రమంగా పండించుట, (బి) సేద్యాన్ని ఒకచోటనుంచి మరో చోటుకి మార్చడం, (సి) వాణిజ్యపంటలను మరియు ఆహార పంటలను మార్చి మార్చి పండించుట, (డి) అనేక పంటలను ఒకేసారి పండించుట



2 'గీత గోవిందం' ఎవరు రచించారు?
(ఎ)తుకారాం, (బి)పురందరదాసు, (సి)తులసీదాస్, (డి)జయదేవుడు.

3 ఏషియాటిక్ సొసైటీని స్థాపించిన వారు ఎవరు?
(ఎ)అనిబిసెంట్, (బి)జిడ్డు కృష్ణమూర్తి, (సి) విలియంజోన్స్, (డి) వారన్ హేస్టింగ్స్.

4 సోయాచిక్కుడులో అధికంగా లభించేవి:
(ఎ)విటమినులు, (బి)మాంసకృత్తులు (ప్రోటీనులు), (సి) పోషకాంశాలు (న్యూట్రియంట్స్), (డి) పిండిపదార్థాలు (కార్బోహైడ్రేటులు)

5 ట్రిపిల్ ఆంటిజన్(Triple antigen) నివారించేది·
(ఎ)కోరింతదగ్గు, (బి)పోలియో, (సి)టైఫాయిడ్, (డి)మసూచికము

6 సెక్యులరిజం అంటే?
(ఎ)అన్నిమతాలకు సమానమైన అంగీకారము, (బి)అన్నిమతాలకు అసమానమైన అంగీకారము,(సి)తమ మతం అవలంబిస్తూ ఇతర మతాలను కూడా సహించుట, (డి)దేశంలో మత బహిష్కారం.

7 వాస్కోడాగామా ఇండియాకు కేప్ ఆఫ్ గుడ్ హోప్ మీదుగా సముద్రమార్గం కనిపెట్టి మొట్టమొదట చేరినది
(ఎ) డయ్యూ (Diu), (బి) గోవా (Goa),(సి)యేనామ్(Yenam), (డి) కోజికోడ్ (Kozhikode)

8 భారతదేశంలో ఒకరూపాయి నోటు మీద ఎవరి సంతకం ఉంది?
(ఎ)ఫైనాన్స్ మినిస్టరు, (బి)ఛైర్మన్, ఫైనాన్స్ కమిషన్, (సి)సెక్రటరీ, మినిస్ట్రీ ఆఫ్ ఫైనాన్స్, (డి) గవర్నరు, రిజర్వ్ బాంక్ ఆఫ్ ఇండియా

### రేపటి మంచిరోజుకి

దూరప్రయాణం చేసేటప్పుడు దూరంగా ఉన్న మన గమ్యస్థానాన్ని మొత్తం దూరంగాక దారిలో తరువాతి మైలురాయిని గుర్తించుకుంటే మన శ్రమ తగ్గినట్లు అనిపిస్తుంది. అదే విధంగా ప్రస్తుతం ఈ రోజును మనం బాగా గడుపుకుంటే దానంతట అదే రేపు మంచిరోజు అవుతుంది.

—డేల్ కార్నెగీ

"నీ బాధను నీ స్నేహితులకు కూడా చెప్పకు.
నీ బలహీనతను నీశత్రువుల ముందు ప్రదర్శించకు."

## తెలివికి పరీక్ష

1 నిన్నటి 'కొత్త' నేటి 'పాత' అయితే నేటి కొత్త రేపటికి ఏమవుతుంది?
2. ఏది ఎక్కువ భారంగా ఉంటుంది? ఒకటన్ను ఉక్కా లేక ఒకటన్ను కర్రా?
3. పగటిమాటలు పనికి చేటు. మరి రాత్రి మాటలు—? వాక్యాన్ని పూర్తి చేయండి.
4. గురువు మహమ్మదీయుడు, శిష్యుడు హిందువు.ఎవరీ గురుశిష్యులు?
5 గుడిలో మత మాత్సర్యం, బడిలో కుల కాలుష్యం కాలుమోపితే మానవ జీవితాల గతి ఏమిటి?
6. రైలు ప్రయాణానికి 'లెస్ లగేజి - మోర్ కంఫర్ట్' అనే సూత్రం వర్తిస్తే వృద్ధుల జీవయాత్ర సుఖంగా సాగిపోవాలంటే?
7. మన అనర్థానికి కారణం అందులోనే ఉంది. ఏమిటది?
8. పరోపకారానికై ఆడే అసత్యం సత్యం అయితే పరాపకారానికి ఆడే సత్యం?

## మాటల మహిమ

1 పైఠాణి: జరీ(ఎ), జలతారు(బి), పరికిణీ (సి), కొంగు(డి).
2. బడుగు: శవము(ఎ), అసమర్థుడు(బి), అల్లుడు(సి), పెద్ద(డి).
3. బూమె: మాయమాట(ఎ), మారువేషము (బి), మాయ(సి), అబద్ధము(డి).
4. భజన: ధైర్యము(ఎ), శక్తి(బి), సత్తువ(సి), పగిలినది(డి).
5. పసి: వాసన(ఎ), ఆకలి(బి), శైశవదశ యందున్న(సి), పచ్చని(డి).
6. కీలు: గుట్టు(ఎ), మర్మము(బి), సీల(సి), ఉపాయము(డి).
7. కూడు: అన్నము(ఎ), కలసియుండు (బి), కలుగు(సి), రమించు(డి).
8. గాయకుడు: పాటపాడువాడు(ఎ), వర్తకుడు (బి), ప్రౌఢుడు(సి), విషవైద్యుడు(డి).

(జవాబులకు వ పేజీ చూడండి)

## బి సి మొదటి శతాబ్దానికి పూర్వమే క్రొవ్వు వొత్తులు చేయబడ్డాయి



*బిసి మొదటి శతాబ్దానికి ముందే ప్రజలు క్రొవ్వువొత్తులు తయారు చేసుకున్నారు. వెయ్యి సంవత్సరాలకు పూర్వం సమానదూరాలలో 12 గుర్తులు గల ఒక క్రొవ్వువొత్తి మండటానికి ఒక రోజు పట్టేది 17వ శతాబ్దంలో ఇంగ్లండులో ఒక అంగుళం పొడవు క్రొవ్వువొత్తి వెలిగించి ఏలం ప్రారంభించేవారు. అది ఆరిపోయినప్పుడు ఏలం ముగించేవారు మొదటి రోజులలో జంతువుల క్రొవ్వునుండి తయారైన క్రొవ్వువొత్తులు చాలా కాంతి వంతంగా ఉండేవి. ఖరీదు కూడా ఎక్కువగా ఉండేవి కొంతసేపు మండిన తరువాత ఇవి పటపటా కొట్టుకోవడంచేత తరచు వొత్తిని కత్తిరించవలసి వచ్చేది. 1860లో పారాఫిన్ మైనం మధ్య అల్లిన నూలువొత్తులు పెట్టి చాలా అభివృద్ధి చేసారు*

"సక్రమమైన విద్యావిధానం మీదే ఉత్తమ సమాజ నిర్మాణం సాధ్యం అని ప్రపంచమంతా తెలుసుకున్నారు."

—జవహర్‌లాల్ నెహ్రూ

# అందరూ అభిమానించే జంబో

ప్రపంచంలో ఏనుగులన్నిటిలో మిక్కిలి అభిమానించదగినది ఆఫ్రికాజంబో. ఏనుగులు అన్నీ అందంగా నాట్యంచేస్తాయి. కానీ వాటికి బ్రహ్మ చెముడు. చెవులకు ఏమీ వినిపించదు. చిన్న పిల్లలతో అల్లరిగా ఆటలు ఆడతాయి. అయినా అంత అనాగరీకమైన మోటు జాతికి చెందిన జంతువు ప్రపంచంలో ఇంకొకటిలేదు. వీటిని సులభంగా మచ్చిక చేసి పెంచుకోవచ్చు. కాని వాటిని కూడా ఇంట్లో పెంచుకోడానికి మనకి ఇక్కడ వీలైనంత పెద్దపెద్ద భవనాలు



పెద్ద రూపం ఉన్న ఈ ఏనుగు మిక్కిలి సాధువుగా ఉన్నా అనేక వివరీత లక్షణాలు కలిగినది. కాబట్టి వాటి జీవితం అంతా ఇదమిద్ధ మని నిర్ణయించడానికి వీలులేకుండా దైవా దీనంగా ఉంటుంది.

కొన్నికొన్ని దేశాలలో విధి విరామం లేకుండ ప్రొద్దుటి నుంచి రాత్రిదాకా వీటిచేత పెద్దపెద్ద దూలాలను చేరవేస్తూంటారు. కొన్ని దేశాలలో దీనిని దైవంగా భావించి పూజిస్తారు. చాలా చోట్ల వీటికి అరటిపళ్లు ఇస్తూంటారు సర్కసులలో మొగ్గలు వేయడానికి, ట్రిక్కులు చేయడానికి శిక్షణను ఇస్తారు.

జీవితంలో దాని అదృష్టాన్ని గురించి దానికి ఏచీకూ చింతా ఉండదు దానికి అపకారం చేయనంత వరకూ ఏపనికి నియోగిస్తే ఆపనిని విసుగు విరామం లేకుండా చేస్తూంటుంది.

బ్రిటన్‌లో మొట్టమొదట 54బిసిలో జూలియస్ సీజర్ ఏనుగును ప్రవేశపెట్టాడు. బ్రిటన్ దేశపు రాజైన కాస్సివలానుస్, అతని సైన్యం జూలియస్ సీజరు థేమ్స్ నదిని దాటనీయకుండా ఆటంకం కలిగించేవారు. ఉన్నవాటిలో పెద్ద ఏనుగును తీసుకురమ్మని జూలియస్ సీజర్ ఆజ్ఞాపించాడు. దానిపైన ఒక అంబారీ నిర్మించి విలుకాండ్రను కూర్చోబెట్టి నడిపించేవాడు. బ్రిటన్ దేశస్థులు అటువంటి జంతువును అంతకుముందు అసలు చూడలేదు. వారి గుర్రాలు దీనిని చూసి బెదిరి పారిపోయేవి

ఏనుగులన్నిటిలో ఆఫ్రికానుంచి వచ్చిన జంబో అత్యంత ప్రియమైనది అందరికీ అభిమాన పాత్రమైనది దానికా పేరు ఇంగ్లీషు భాషలో చిరస్థాయిగా నిలిచిపోయింది.

లండన్ జూ నుంచి జంబోను దానితో ఉండే సహవాసి ఆలిస్ నుండి వేరుచేసి 1882లో అమెరికా సర్కస్‌కింగ్ పి.టి. బార్నుమ్‌కు అమ్మినప్పుడు బ్రిటిషువారు తీవ్రంగా తమ నిరసనను తెలిపారు.

1885, సెప్టెంబర్13న కెనడాలో సెంట్ థామస్ దగ్గర రైలుమార్గం దాటుతుండగా రైలు అకస్మాత్తుగా దీనిని ఢీకొట్టిమోదింది. ఈ అభిఘాతానికి రైలు ఇంజను, రెండుబోగీలు పడిపోయాయి.

ఈ ఏనుగు అపురూపమైన విశ్వాసానికి సంవత్సరాల తరబడి మరపురాని ఒక చిహ్నంగా నిలిచిపోయింది. జోడుగా ఉండే సహవాసికి ఏనుగులు ఎప్పుడూ వంచించి ద్రోహం చేయవు.

●

"నీవు చెప్పేది అంతా ఎప్పుడూ ముఖ్యం కాదు,
ఎలా చెబుతున్నావు అనేదే ఎప్పుడూ ముఖ్యం."

—మాక్సిమ్ గోర్కీ

# నిజాలు - నిదర్శనాలు

## 45 లక్షల అంతర్జాతీయ ప్రయాణీకులు బొంబాయి అంతర్జాతీయ విమాన కేంద్రం ద్వారా ప్రయాణం చేశారు



1988-89 సంవత్సరకాలంలో బొంబాయి అంతర్జాతీయ విమానకేంద్రం 45 లక్షలు, ఢిల్లీ 26.5 లక్షలు, కలకత్తా 6.1 లక్షలు మరియు మద్రాసు 4.3 లక్షలు అంతర్జాతీయ ప్రయాణీకులను చేపట్టాయి.

* * *

## ప్రపంచపు సోయా చిక్కుడు, జొన్న పంటలో యుఎస్ 50 శాతం ఉత్పాదిస్తూంది

ప్రపంచం మొత్తం సోయా చిక్కుడు మరియు జొన్నపంటలో నగానికి నగం యునైటెడ్ స్టేట్స్ ఉత్పాదిస్తూంది. ప్రత్తి, గోధుమ, పొగాకు మరియు వెజిటబుల్ నూనెలలో 10 మొదలు 25 శాతం ఉత్పాదిస్తూంది.

'స్పాన్' సౌజన్యంతో

* * *

## 120 లక్షల కుష్ఠురోగులు

ప్రపంచం మొత్తం మీద ఉన్న 120 లక్షల కుష్ఠురోగులలో భారతదేశంలో 40 లక్షల మంది రోగులు ఉన్నారు. ఈ మొత్తంలో 13.6 లక్షలమంది రోగులు తమిళనాడు మరియు ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నారు.

* * *

## రోడ్ల దుస్థితి వల్ల రూ. 6000 కోట్లు నష్టం

ముఖ్యంగా రోడ్ల దుస్థితి వల్ల ఇంధన వినియోగంలోనూ, టైరుల అరుగుదలలోను ఏటా భారతదేశానికి రూ.6000 కోట్లు ధనం నష్టం ఏర్పడుతూంది. ఒక్క ఇంధన వినియోగానికి మాత్రమే రూ. 1,500 కోట్లు ఖర్చు అవుతూంది.

* * *

## పోషకాహారలోపం వల్ల కల్గే అంధత్వం

ఇటీవల జరిపిన సర్వే ప్రకారం భారతదేశంలో దాదాపు 100,000 మంది పిల్లలకు పోషకాహార లోపం వల్ల అంధత్వం ఏర్పడుతూంది. వీరిలో చాలా మంది 5వ సంవత్సరం వయస్సు దాటక ముందే గ్రుడ్డివారైపోతున్నారు. వృద్ధాప్యంలో అంధత్వం పొందేవారిలో 80 శాతం మంది కాటరాక్టువల్ల గ్రుడ్డివారైపోతున్నారు.

* * *

### బౌద్ధులు ఎవరు?

[illegible]

"సాలెగూళ్లులా ప్రారంభమైన అలవాట్లు ఇనుప సంకెళ్లుగా మారతాయి."

## చెరకు సాగుబడి క్రింద 3.4 మిలియన్ హెక్టేరులు



భారతదేశంలో పంచదార పరిశ్రమ సుమారు 3.35 లక్షలమందికి ప్రత్యక్షంగా ఉద్యోగావకాశాలు, 30 మిలియను చెరకు రైతులకు పరోక్షంగా జీవనాధారం కల్పిస్తూంది. ఇది దేశంలో 67,000 గ్రామాలకు విస్తరించుకుంది. ప్రస్తుతం దేశంలో 3 4 మిలియను హెక్టేరుల విస్తీర్ణం చెరకు సాగుబడిలో ఉంది.

'యోజనా' సౌజన్యంతో

* * *

## భారతదేశంలో రికార్డు కావింపబడిన అటవీప్రదేశం 75.18 మిలియన్ హెక్టేరులు

డెహ్రాడూన్‌లో ఫారెస్ట్ సర్వే ఆఫ్ ఇండియా వారు ప్రకటించిన 'స్టేట్ ఆఫ్ ఫారెస్ట్ రిపోర్ట్ 1987' ప్రకారం భారతదేశంలో 75 18 మిలియను హెక్టేరుల అటవీ ప్రదేశం రికార్డు కావింపబడింది. కానీ అడవులు 64.20 మిలియను హెక్టేరులు మాత్రమే విస్తరించుకున్నాయి. ఇది మొత్తం భౌగోళిక విస్తీర్ణంలో 19.52 శాతం.

* * *

## భారతదేశంలో 196 ప్రాంతీయ గ్రామీణ బాంకులు

భారతదేశంలో 196 ప్రాంతీయ గ్రామీణ బాంకు (RRBS) లలో 1989 మార్చి 31 నాటికి తేలిన నష్టం రూ 191 04 కోట్లు.

* * *

## యుఎస్ పంటభూమిలో మూడవ వంతు ప్రదేశంలో ఎగుమతికి ఆహార ధాన్యాలు పండింపబడుతున్నాయి

ఒక్క అమెరికా వ్యవసాయదారుడు స్వయం పోషణకి మరియు స్వదేశంలోను ఇతర దేశాల లోను 74 మందికి సరిపోయేటంత పంట పండిస్తాడు. మొత్తం యుఎస్ పంటభూమిలో ఇప్పటికీ మూడవవంతు ప్రదేశంలో ఎగుమతికి ఆహార ధాన్యాలు ఉత్పాదింప బడుతున్నాయి.

'స్పాన్' సౌజన్యంతో

* * *

## చర్చిల్ చమత్కారం

ఒకసారి సర్ విలియం జాన్సన్ హిల్స్ అనే సభ్యుడు పార్లమెంటులో మాట్లాడుతూంటే చర్చిల్ అనంగీకారంగా తలఊపుతూ వింటున్నాడు. అదిచూసి విలియం 'గౌరవనీయులైన చర్చిల్ తల అడ్డంగా ఊపుతున్నారు. నేను చెప్పేది నా స్వంత అభిప్రాయం మాత్రమే' అన్నాడు. వెంటనే చర్చిల్ 'నేను ఊపుతున్నది కూడా నా స్వంత తలే' అంటూ చమత్కరించాడు.

"ప్రతీ విజయవంతుడు బుద్ధిమంతుడు కాకపోవచ్చు.
ప్రతీ బుద్ధిమంతుడు విజయవంతుడు కాకపోవచ్చు"

## 450,300 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం

ఫిబ్రవరి 1989 నాటికి భారతదేశంలో గల 450,300 గ్రామాలకు విద్యుత్ సౌకర్యం కలిగించ బడింది రాష్ట్రవారీ విద్యుదీకరణ చేయబడిన గ్రామాలు-ఉత్తరప్రదేశ్-78,000, మధ్యప్రదేశ్-55,000, బీహార్-43,000, మహారాష్ట్ర-38,800, ఆంధ్రప్రదేశ్-26,800, తమిళనాడు-15,800, పశ్చిమబెంగాల్-24,400 మరియు హిమాచల ప్రదేశ్-16,750.

* * *

## 36 శాతం పంట భూములకు నీటి పారుదల సౌకర్యాలు

1947 లో దేశం స్వాతంత్ర్య సమయంలో భారత దేశంలో సాగుబడి క్రింద ఉన్న మొత్తం విస్తర్ణంలో 5వ వంతుకు మాత్రమే నీటి పారుదల సౌకర్యాలు ఉన్నాయి. ఇదినేడు 36 శాతానికి పెరిగింది 2010 AD నాటికి లభించే నీటి వనరులలో నీటిని అంతా వినియోగించి భారత ప్రభుత్వం 114 మిలియను హెక్టేరులకు నీటి పారుదల సౌకర్యం కలిగించాలని ఆశిస్తూంది

-'యోజనా' సౌజన్యంతో

* * *

## భారతదేశంలో 18 టైగర్ రిజర్వులు

ఇప్పుడు భారతదేశంలో మొత్తం 18 టైగర్ రిజర్వులు ఉన్నాయి. దేశంలో అంచనావేయ బడిన పులుల సంఖ్య 4334.

## ఈనాడు దేశానికి అవసరం

*ఈనాడు దేశానికి కావలసింది వాత్సల్యపూరిత మైన స్నేహభావం, ఉత్సాహపూరితమైన కార్యనిరతి, క్రీడారంగాలలో అభివృద్ధి పొందే స్వభావం. ఇవి ఆఫీసులలోను, ఫాక్టరీలలోను ప్రతిబింబిస్తే భారత దేశానికి ఆర్థిక స్వాతంత్ర్యం, సాంఘికధర్మం, అందరూ అనుకునే దానికంటే అతి శీఘ్రంగా సిద్ధిస్తాయి*

—సి.ఎన్.అన్నాదురై (అన్నా)

## నేత్ర చికిత్సకు సంచాలక శిబిరం



*కంటివ్యాధుల నివారణకై ఏర్పడిన టర్క్‌మన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఒక సంచాలక నేత్ర శస్త్ర చికిత్సా గదిని ఏర్పాటుచేసింది. ఇది దూరంగా ఉండే నూనె క్షేత్రాలకు, ఎడారులలో చిన్న చిన్న గ్రామాలకు వెడుతుంది దీంట్లో ఆధునిక సాధన సంపత్తితో ఒక కన్సల్టింగ్ గది ఉంటుంది ఇందులో ఎవరైనా కంటిని పరీక్షచేయించుకుని వ్యాధి నివారణ చేసుకోవచ్చు. మైక్రోసర్జరీ సహాయాన్ని కూడా పొందవచ్చు.*

"ఆదేశించడానికి ముందు ఆచరించడం నేర్చుకో."

# తెలుసుకోదగిన విషయాలు

## (వరల్డ్ కప్ ఫుట్‌బాల్)

* 1930లో ఉరుగ్వేలో నిర్వహింపబడిన మొట్ట మొదటి వరల్డ్ కప్ పోటీలో పదమూడు దేశాలు పాల్గొన్నాయి.

* 1900 వ సంవత్సరం స్విట్జర్లాండ్‌లోని జ్యూరిచ్ లో ఉన్న ఫెడరేషన్ ఇంటర్నేషనల్



డి ఫుట్‌బాల్ అసోసియేషన్ వారి (FIFA) పారిస్ సమావేశంలో మొట్టమొదట వరల్డ్ కప్ ఫుట్‌బాల్ అనే భావన ఆవిర్భవించింది. వరల్డ్ కప్ ఫుట్‌బాల్ నియంత్రించే అధికారం దీనిదే.

* మొట్టమొదటి వరల్డ్‌కప్‌ని 'గోల్డెన్ ఏంజెల్ ఆఫ్ ఫుట్‌బాల్ అనేవారు. సుప్రసిద్ధ ఫ్రెంచి శిల్పి ఆబెల్ లాఫ్లూర్ దీనిని రూపొందించాడు. ఇది 12 1/2 అంగుళాల చిన్న గట్టి బంగారు విగ్రహంగా చేయబడింది.

* నేటి FIFA వరల్డ్ కప్ 1974 లో పశ్చిమ జర్మనీ విరాళం దీనిని తమ మైదానంలో ఫైనల్స్‌లో నెదర్‌లాండ్స్‌ను 2-1 తో ఓడించి పశ్చిమ జర్మనీ గెలుచుకుంది.

* మిలన్(ఇటలీ)కి చెందిన బెర్టోని దీనిని 50,000 డాలర్లవ్యయంతో తయారు చేసాడు. దిగ్విజయానందంతో ఇద్దరు క్రీడాకారులు ప్రపంచాన్ని పట్టుకున్నట్టు ఉంటుంది ఇది 11 పౌండ్లభారం తూగుతుంది బంగారం మరియు మేల్‌చైట్‌తో 36 సెం మీ ల ఎత్తుగా గట్టిగా చేయబడింది.

* ఫ్రాన్స్‌లో నిర్వహింపబడిన 1938 వరల్డ్ కప్ పోటీలలో బ్రెజీల్ పోలండ్‌ను 6-5 తో ఓడించింది. అదనపు కాలంలో 4 గోల్సు వచ్చాయి.

* ప్రస్తుతం ఫుట్‌బాల్ ఆడే 166 దేశాలు ఫెడరేషన్ ఇంటర్నేషనల్ డి ఫుట్ బాల్ అసోసియేషన్(FIFA) సభ్యులు.

## మిక్కిలి ఎత్తుగా ఉండే డామ్

*మధ్య ఆసియా సోవియెట్ టడ్జికిస్తాన్‌లో వాక్ష్ నది మీద నిర్మింపబడుతున్న మట్టితో నింపిన 335 మీటర్ల ఎత్తుగా ఉండే రొగున్స్కీ డామ్ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన డామ్ అసాధారణ మైన రూపకల్పనతో నిర్మించిన ఈ డామ్‌లో కొంత భాగం రొగున్స్కీ హైడ్రోపవర్ ప్రాజెక్టుకు చెందినది డామ్ మరియు కొండలను చొచ్చుకుని వచ్చే ఎలక్ట్రిక్ ట్రాన్స్‌మిషన్‌లైన్ మాత్రం భూమిపైన కనిపిస్తుంది ఇతర యాంత్రిక నిర్మాణాలన్నీ ఇకముందు నిర్మించబోయే 300 మీటర్ల లోతు రిజర్వాయర్ సొరంగాలలో ఉంటాయి.*

*ట్రక్‌లు ఉపయోగించకుండా నిర్మింపబడే ఈడామ్ ప్రపంచంలోనే మిక్కిలి బ్రహ్మాండమైనది 70 మిలియను ఘనమీటర్ల కంకర మరియు ఇసుక కన్వేయర్‌లైన్స్ మీదుగా అందించబడు తుంది . భవిష్యత్తులో ఇక్కడి టర్బైనులు మొత్తం 3 6 మిలియన్ కిలోవాట్టుల శక్తిని అందుకుంటాయి డామ్ నిర్మాణ కార్యక్రమం 1973 లో ప్రారంభమైంది*

"గొప్పతనం అంతా యోచనపై ఆధారపడి ఉంటుంది. సక్రమంగా యోచించడానికి ఉద్యమించు."

# త్యాగోపనిషత్తు

త్యాగోపనిషత్తు అనడంతోటే మీకు ఉపనిషత్తులు జ్ఞాపకం రాకమానవు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం చేరిన 'త్రయీవిద్య'ను, దీని తరువాత పుట్టిన అధర్వణ వేదాన్ని కలిపి శ్రుతులంటారు. మిగిలిన శాస్త్రాలు, మతగ్రంధాలు ఈ వేదాలను ఆధారంగా చేసుకుని ఆవిర్భవించాయి. ఉపనిషత్తులు ఈ విధంగా



వచ్చినవే. వేదాల్లో జ్ఞానకాండకు సంబంధించిన మంత్రాలే ఉపనిషత్తులు. 108 ఉపనిషత్తులలో ముఖ్యమైనవి ఈశ, కేన, కఠ మొదలైన (10) దశోపనిషత్తులు. ఇవి బ్రహ్మజ్ఞానాన్ని కలిగించుకోడానికి మార్గదర్శకాలు. ఇవే బ్రహ్మ సూత్రాలకు, భగవద్గీతకు కూడా మూలం.

వేదాంతం సామాన్యులకు తేలికగా బోధపడేది కాదు. పూర్వమహర్షులు అపూర్వమైన యోచనా శక్తితో, విజ్ఞాన ప్రభావంతో స్పందింపజేసిన ఉపనిషత్తుల ధర్మాలు అన్ని కాలాలకు చెందినది, నిత్యసత్యాలు, దేశకాలాతీతాలు. అన్ని మతాలను తమలో ఇముడ్చుకోగల శక్తిని ఇవి సంతరించుకున్నాయి. ఇట్టి విజ్ఞానదాయకమైన ఉపనిషత్సారాన్ని గాయకులకు, పండితులకు, పామరులకు అతి సునాయాసంగా తెలుగు కీర్తనలలో తెలియజేసిన వాగ్గేయకారకులు శ్రీత్యాగరాజు. త్యాగరాజు మహాపురుషులు, గొప్పవాగ్గేయకారులు, పండితులు, భక్తులు. ఆధ్యాత్మ తత్వాన్ని అతిసరళంగా కీర్తనల ద్వారా తెలియ జెప్పిన సంగీత యోగి. అందుకే ఈయన రచించిన కీర్తనలు 'త్యాగోపనిషత్తు' గా ప్రసిద్ధిపొందాయి.

దక్షిణ భారత సంగీతానికి అఖండ పరివ్యాప్తి చేకూర్చిన సంగీతత్రిమూర్తులలో త్యాగరాజు ఒకరు. వీరి కీర్తనలు రాగస్వరూపం. పరిపూర్ణంగా అన్నికళలతో మృదువైన శైలిలో, నవ్యకల్పనలతో ఉంటాయి.

శ్రీ త్యాగరాజు పూర్తిపేరు కాకర్ల త్యాగరాజు. నారద వరప్రసాదులైన కారణ జన్ములు. బాల్యం నుంచీ జయదేవుని అష్టపదులు, పురందరదాసు కీర్తనలు, రామదాసు కీర్తనలు, అన్నమాచార్యుల సంకీర్తనలు నేర్చుకున్న వారు. పోతన భాగవతాన్ని నిత్యపారాయణం చేసారు. మరుదనల్లూరు మఠానికి చెందిన

## బిలియన్ అంటే ఎంత?

*నిజంగా బిలియన్ అంటే ఎంత? దీనిని గురించి వివిధదేశాలలో వివిధ అభిప్రాయాలు ప్రచారంలో ఉన్నాయి. యునైటెడ్‌స్టేట్స్, కెనడా మరియు ఫ్రాన్స్‌దేశాలలో ఒక బిలియన్(వెయ్యి మిలియనులు)ని 1,000,000,000 (ఒకటి సంఖ్య తరువాత తొమ్మిది సున్నలు)గా వ్రాస్తారు. యునైటెడ్‌కింగ్‌డం, పశ్చిమ జర్మనీలలో బిలియన్ అంటే ఒక మిలియన్ మిలియన్ అంటారు. దీనినే 1,000,000,000,000 (ఒకటి సంఖ్య తరువాత పన్నెండు సున్నలు)గా వ్రాస్తారు.*

"సాంప్రదాయక పద్ధతిని ఆమోదించి అనుసరించడం లోకరీతి."

రామకృష్ణానంద స్వామి ఉపదేశానుసారంగా రామతారక మంత్రాన్ని తిరువయ్యారులో పంచనదీశ్వర దేవాలయంలో 96 కోట్ల పునశ్చరణ చేసారు. శ్రీరాములవారు ప్రత్యక్షమైయారు. తారక మంత్ర సిద్ధి కలిగింది. పరమ భక్తాగ్రేసరు లైన గొప్ప వాగ్గేయ కారకులుగా వీరి కీర్తి దేశమంతటా నలుదిక్కులా వ్యాపించింది.

ఆదికవి వాల్మీకి రామచరితాన్ని ఆది కావ్యంగా2 400 శ్లోకాల్లో రచించారు. అదేరీతిగా త్యాగరాజు శ్రీరాముని గుణవైభవాలను గొప్ప గానామృతంగా 'త్యాగరాజార్చిత, 'త్యాగరాజనుత' అనేముద్రతో ప్రవహింపజేసిన 2400 కీర్తన లలో మనకు లభించినవి 1000 కీర్తనలు. వీటిలో 600 కీర్తనలకు మాత్రమే వర్ణం, మెట్లు ఉన్నాయి.

లోకులకు ఉపనిషద్రహస్యాలను, మోక్షో పాయమైన భక్తి మార్గాన్ని సునాయాసంగా బోధించడానికి త్యాగరాజు సంగీత సాహిత్యాలను రెంటిని జోడించారు. రాష్ట్రాలు వేరైనా, మాట్లా డుకునే భాషలు వేరైనా, ఆంధ్రులైనా, తమిళులైనా, కేరళులైనా, కర్నాటకులైనా అందరికీ ఒకే సంస్కృతి, ఒకే సంగీతం, ఒకే వేదాంతం అని చాటించిన 'త్యాగబ్రహ్మ' కృతులు అందరికీ చిదానందాన్ని కలిగించే ఆధ్యాత్మిక సాధనలు. జీవన్ముక్తి మొదలు వివిధ సాంఘిక సమస్యల వరకూ అన్నిటికీ రామభక్తి ఈ కీర్తనలలో ముఖ్యకేంద్రమైంది. హైందవ సాంప్రదాయాన్ని అనుసరించి అనేక విషయాలు, వేదోపనిషత్తుల సారాంశాలు, పురాణేతిహాస ధర్మాలు, నీతులు తేట తెలుగులో సంగీత సరళిలో మనస్సుకు నాటుకుపోతాయి.

సంసారి మోక్షానికి అవసరమైన ఉత్తమ ధర్మాలను వివరిస్తూ

'సంసారులైతేనేమయ్యా శిఖి
పింఛావతంసుడెదుట నుండగా'

## స్త్రీ జనాభాలో 3 శాతానికి యూనివర్సిటీ డిగ్రీలు

*భారతదేశంలో మొత్తం స్త్రీ జనాభాలో సుమారు 3 శాతం మాత్రమే యూనివర్సిటీ డిగ్రీని పొందిన వారు. వీరిలో చాలా తక్కువ శాతం ఉద్యోగాలలో ఉన్నారు.*

—'యోజనా' సౌజన్యంతో

## చంద్రమండలంలో మానవుడు



*మొట్టమొదట మానవుడు జూలై 20,1969 ఆదివారం (తూర్పు అమెరికా కాలమానం ప్రకారం) రాత్రి 1056కి చంద్ర మండలంలో కాలుపెట్టాడు ఇతడే 38 సం.ల వయస్సు గల నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ ఇతడు అమెరికాలో టెస్ట్‌పైలట్ మూడు రోజులకు ముందు ఫ్లారిడాలో కేప్‌కెన్నడీ నుంచి అంతరిక్షంలోకి ప్రవేశపెట్టబడిన అపోలో 11 ఫ్లైట్ కమాండరు. ఇతడు మరియు ఇతడి స్నేహితుడు కలోనెల్ ఎడ్ (బజ్) ఆల్డ్రిన్ లూనార్ మాడ్యుల్ 'ఈగిల్'ను సురక్షితంగా చంద్రమండలం మీద దించారు. చంద్రమండలంలో చాలా వరకు 1అంగుళం దళసరిగా చేరిన దుమ్ములో ప్రప్రథమంగా వీరి పాదాలు ఏర్పడ్డాయి. ఈ అంతరిక్ష యోధులైన ఆస్ట్రోనాటులు చంద్రమండలంలో 21గం. 36ని. 21సెకండ్లు ఉన్నారు. వారు 485 పౌండ్లు బరువు గల చంద్రమండలపు ముచ్చుముక్కలను తెచ్చారు.*

"యథార్థస్థితి నుంచి తప్పించుకుని పారిపోవడానికి
చేసే ప్రయత్నాలే మతసిద్ధాంతాలు, తాత్త్విక సూత్రాలు."

అనే కీర్తనలో సంసారులై ఉండీ కూడా పరమ పదాన్ని సులభంగా ఆర్జించుకోవచ్చని రాజయోగ మార్గాన్ని నిరూపించారు. మనోవాక్కాయములతో ఇంకొకరికి ఎవ్వరికీ హింస తలపెట్టకుండా ఎప్పుడూ పరమహంసలైన మహాత్ములతో చేరి భగవంతుని ప్రసంగాలు చేస్తూ శ్రీహరిని విశ్వ సిస్తూ ఉండేవారు. సంసారులైనా తరించ డానికి లోటు లేదంటూ, సంసారారణ్యంలో సంచరించేవారు ధ్యాన యోగాన్ని ఆశ్రయించి హరినామ కీర్తనం చేస్తూ కర్మఫలాలను ఆ శ్రీహరికే సమర్పించుకుంటే భగవంతుని దయచే జ్ఞానవైరాగ్యాలు సులభంగా సిద్ధిస్తాయి అని చెప్పారు.

హిందూ ధర్మాన్ని అనుసరించి దైవము, అన్ని మతాలకు సమ్మతమైన పరమాత్మ తత్త్వం. కానీ ఏదో ఒకరూపం చేత, పేరుచేత నిర్దేశింప బడదగిన వాడుకాదు అనే సూత్రం

'ఎవరని నిర్ణయించిరిరా
నిన్నెట్లారాధించిరిరానరవరు'

అనే కీర్తనలో ప్రతిపాదింపబడింది. రామనామ మంత్రరహస్యాన్ని వివరిస్తూ 'ఓరామా నిన్నెవరని నిర్ణయించారు? నిన్నేవిధంగా ఆరాధన చేసారు? శివుడనా, మాధవుడనా, బ్రహ్మ అనా లేక త్రిమూర్తులకు కారణమైన పరమాత్ముడనా అంటూ, శివకేశవాద్వైతము తెలిసిన వారు ఘనులన్నారు. మరోచోట ద్వైతము సుఖమా, అద్వైతము సుఖమా అనే కీర్తనలో గగన, పవన, తపన, భువనాద్యవనిలో (ఆకాశాది భూతములందు), బ్రహ్మాశివాదుల యందు, భగవద్భక్తులలో అంతా భగవన్మయంగా 'బాగర మించే' రాముడు ఒకే రూపంలో (చైతన్య), సర్వ సాక్షీరూపంగా రమిస్తున్నాడని సూత్రీకరించారు.

శ్రీరాముని దివ్యభజన సద్గతిని కలిగిస్తుందని జనన మరణాలనే ముఖ్యరోగముల భయం పోతుందని, దురాశతో, భ్రాంతితో మోసపోవద్దని

## 40,000 రకాల కీటకాలు సేకరించబడ్డాయి

*ఒక జర్మన్ శాస్త్రజ్ఞుల బృందం 40,000 కీటక జాతులను, 800 రకాల వక్షులను సేకరించింది. ఇవి మ్యూనిచ్‌లో ఏర్పాటైన జూలాజికల్ మ్యూజియంలో ప్రదర్శింపబడతాయి.*

## ప్రపంచపు పెద్ద లైబ్రరీలు




*ప్రపంచంలో పెద్దపెద్ద లైబ్రరీలు, వాటిలో పుస్త కాల సంఖ్య క్రింద సూచింపబడ్డాయి*

| లైబ్రరీ పేరు | మిలియనులో పుస్తకాలు |
|---|---|
| 1 నేషనల్ లైబ్రరీ-బీజింగ్ (చైనా) | 44 |
| 2. బిబ్లియోథిక్‌నేషనేల్-పారిస్ (ఫ్రాన్స్) | 60 |
| 3. బ్రిటిష్‌మ్యూజియంలైబ్రరీ-లండన్ (యు.కె.) | 60 |
| 4 కేంబ్రిడ్జి యూనివర్శిటీ లైబ్రరీ (యు.కె.) | 25 |
| 5. బోడ్లీయాన్ లైబ్రరీ-ఆక్స్‌ఫర్డ్ (యు కె.) | 225 |
| 6. లెనిన్‌స్టేట్‌లైబ్రరీ-మాస్కో (యుఎస్ఎస్ఆర్) | 20.00 |
| 7. లైబ్రరీ ఆఫ్ కాంగ్రెస్-వాషింగ్‌టన్ (యుఎస్ఏ) | 126 |
| 8 హార్వర్డ్ యూనివర్శిటీ లైబ్రరీ (యుఎస్ఏ) | 6.9 |
| 9. నేషనల్ లైబ్రరీ-కలకత్తా (ఇండియా) | 1.0 |

-'భవాన్స్‌జర్నల్' సౌజన్యంతో

"ప్రేమ హృదయంలో నింపుకోలేనంతసేపూ
అందవికారం, దరిద్రం ఆవరించి ఉంటాయి."

'పరలోక సాధనమే మనసా' అనే కీర్తనలో మనసా శ్రీరాముని స్మరించమని హెచ్చరించారు.

'ప్రొద్దు పొయ్యేని శ్రీరాముని,
పూని భజించవే మనసా'

అంటూ వివేకవంతులు కాలం విలువ తెలుసుకుని దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోమని, శ్రీహరి నామ కీర్తన చేయమని ప్రబోదించారు.

'మనసు స్వాధీనమైన యాఘనునికి
మరియు మంత్ర తంత్రము లేల?

అంటూ మనస్సు స్వాధీనమైన వారికి మంత్ర తంత్రములతో ఏమిపని అనే శాస్త్రీయ సిద్ధాంతాన్ని చాటించారు. మరోచోట మోక్షమనే జీవన్ముక్తికి, విదేహ ముక్తికి పరమార్థమైన ఫలితంలో భేదం లేదంటూ, భక్తితో చేరిన సంగీత జ్ఞానం ఉంటే పరమాత్మ సాక్షాత్కారం, జీవన్ముక్తి సులభం అన్నారు. అదిలేని వారికి మోక్షము కలదా? లేదు అని విశదీకరించారు.

స్వరరాగ సుధారసయుతభక్తి
స్వర్గాపవర్గమురా ఓ మనసా'

అంటూ నాదోపాసనమే ఆత్మదర్శనం కలిగిస్తుందని ఉపదేశించారు. శమదమాది సుగుణాలను ప్రవృద్ధి చేసుకుంటూ లౌకిక వ్యవహారాల పట్ల నిర్లిప్తులై ఉండటమే మోక్షమార్గం అని హెచ్చరించారు. అంతశ్శుద్ధి ముఖ్యమన్నారు. చివరగా శ్రీరామానుగ్రహం ఉన్నవారికి నవ గ్రహాలు ఏకీడు చేయలేవని తెలియజెప్పారు.

సామాన్యంగా లోకులలో కనిపించే విషయ లోలత, డాంబికాచారాలు, జారచోరుల దురాచారాలు, ధనవంతుల గర్వ జీవితము మొదలైన వాటిని త్యాగరాజు తన కృతులలో అనేక చోట్ల తీవ్రంగా ఖండించారు. భక్తి మార్గాలు వేరైనా, మత సాంప్రదాయాలు వేరైనా, అన్ని మతాల లక్ష్యము ఒక్కటే అని బోధించారు. 'నిధి నిక్షేపాలకంటే, రాముని సన్నిధే సుఖమన్ని, మమత బంధన యుత నరస్తుతి కంటే సుమతి త్యాగరాజు రాముని సన్నిధే సుఖ' మన్నారు.

బ్రహ్మ సూత్రాలలో, భగవద్గీతలో, ఉపనిషత్తులలో రహస్యాలను, వాల్మీకి రామాయణంలో వేదాంత సత్యాలను సులభంగా బోధపడేటట్టు వివరింపబడిన వీరి కృతులే త్యాగోపనిషత్తు. ఈ కీర్తనలను పాడుకునే వారి భాగ్యమే భాగ్యం. వినేవారి ఆనందమే ఆనందం.

తాడూరి

## ప్రార్థనకు పూనుకో




అవకాశం లభించినప్పుడు ప్రార్థించు పగలు ప్రార్థనకు ఉత్సాహంతో పూనుకో. ప్రార్థన అవసరాన్ని గ్రహించు. ప్రార్థన వల్ల హృదయం విస్తరించుకుంటుంది. అవిస్తరించుకున్న హృదయంలో పరమాత్ముడు తనకుతానే ప్రత్యక్షమవుతాడు అడుగు-అందుకో. పరమాత్ముని ఆహ్వానించి నీ హృదయంలో పెట్టుకోడానికి తగినంత పెద్దదిగా నీ హృదయం విస్తరించుకుంటుంది.

-మదర్ థెరిసా

"యుద్ధం చేసే యోధులకంటే మనస్సులో యోచనలు శక్తివంతమైనవి బలహీనంగా కనిపించినా ఫలితం బ్రహ్మాండం"

—జవహర్ లాల్ నెహ్రూ

# బ్రోంకియల్ ఆస్త్మా

టి.ప్రైయురిన్

శ్వాసకోశముల సంబంధమైన ఉబ్బసమే బ్రోంకియల్ ఆస్త్మా. ఒకపట్టాన వదలకుండా దీర్ఘకాలం పట్టిపీడిస్తూ తీవ్రమైన అనేక ఇతర వ్యాధులను కలిగిస్తుంది. అప్పుడప్పుడు ఊపిరి తిరగకుండా దగ్గు, ఒగర్పు, ఆయాసంతో ఆస్త్మా రోగులు బాధపడుతుంటారు వారికి జీవితం దుర్భరం అనిపిస్తుంది. ఈరోగం పల్మోనరీ



ఎంఫిసిమా (Pulmonary emphysema), న్యూమోస్క్లీరోసిస్ (Pneumosclerosis) గుండెజబ్బులు, నరముల సంబంధమైన మరియు ఎండోక్రినిక్ (endocnnic) సంబంధమైన అనేక వ్యాధులకు దారి తీస్తుంది.

ఈ రోగానికి ముఖ్యకారణం సూక్ష్మజీవుల సంబంధంలేని అలెర్జన్స్ శరీరతత్వానికి సరి పడని పరిస్థితులు కలిగించే వస్తువుల వల్ల ఈ అలెర్జీ సంభవిస్తుంది. కొన్ని రకాల ఆహార పదార్థాలు, మందులు, రకరకాల దుమ్ము, పశువుల బొచ్చు, వాతావరణంలో మార్పులు మొదలైనవన్నీ దీనికి కారణాలు వాతావరణంలో పరిసర కాలుష్యం వల్ల రకరకాల ఎలర్జీలు బాగా ఎక్కువ అవుతాయి. రోగం సంభవింపజేసే సూక్ష్మజీవులు మరియు వాటివల్ల జీవకణములలో కలిగే రసాయనిక మార్పులవల్ల రోగం ప్రవృద్ధి చెంది, తట్టుకోలేని పరిస్థితులు ఏర్పడటం వల్ల ఆస్త్మా సంభవిస్తుంది.

ఆస్త్మా ఆనువంశికం. వంశపారంపర్యంగా వస్తూంటుంది. పుట్టుకముందే రోగనివారణ ప్రారంభించాలి. స్త్రీ గర్భిణిగా ఉన్నప్పుడు శరీరతత్వానికి సరిపడని వాటిని వర్జించాలి రోగం బాగా ముదిరిపోతే నిపుణుల వైద్యం అవసరముంటుంది.

ప్రొఫిలాక్సిస్ చాలా అద్భుతంగా పనిచేస్తాయి సాధారణంగా రోజూతినే ఆహారంలో మార్పులు కలిగినప్పుడు లేదా మానసికంగా కలిగే మార్పులవల్ల ప్రకోపంచెందినప్పుడు ప్రొఫిలాక్సిస్‌తో ఒగర్పురాకుండా చేసుకోవచ్చు. ముఖ్యంగా పిల్లల విషయంలో ఇది నిజం

## ప్రపంచాన్ని చుట్టివచ్చిన మొదటి జలాంతర్గామి

*మొట్టమొదట ప్రపంచాన్ని చుట్టివచ్చిన జలాంతర్గామి (Submarine) యు.ఎస్.ఎస్.ట్రైటాన్. దీని కమాండర్ కాప్టెన్ ఎడ్వర్డ్ ఎల్.బీచ్ 30,708 మైళ్ళు సముద్ర ప్రయాణంచేసాడు. ఇది 1960, ఫిబ్రవరి 16న లండన్‌లో కనెక్టికట్ సబ్‌మెరైన్ బేస్ నుండి బయలుదేరి 1960, మే 10వ తేదీకి తిరిగివచ్చి చేరింది.*

"ప్రతిభా శక్తులన్నిటిలో అధమం ఒక్కదానినైనా ఆచరణలో పెట్టగలిగినవాడు విజయవంతుడు."

—స్వామీ చిన్మయానంద

ఆస్త్మా దగ్గు రావడానికి కొన్నిగంటలు ముందుగానే లక్షణాలు కనిపిస్తాయి. ఈ లక్షణాలు వ్యక్తిగతంగా ఉంటాయి. ఆయారోగికి అవి మార్పులేకుండా ఉంటాయి ఉన్నట్లుండి జలుబుచేస్తుంది, ముక్కులు మూసుకుపోతాయి దిబ్బడేస్తుంది. ముక్కులో కితకితలు పెడుతూన్నట్లు ఉంటుంది. తుమ్ములువస్తాయి. అట్టి సమయాలలో ఊపిరిచాలదు కాబట్టి ఆయాసపడవలసి వస్తుంది. కష్టపడి గాలి వదలవలసివస్తుంది చిన్నపిల్లలలో కూడా మార్పులు ఏర్పడతాయి. రోగం మామూలుగా కనిపించదు. కోపం ఎక్కువ అవుతుంది. ఊరికే ఏడుస్తారు. మందకొడిగా ఉంటారు. చురుకుదనం ఉండదు మొదట దురద ప్రారంభించవచ్చు. ముఖం, పెదిమలు ఉబ్బుకుంటాయి. ఇటువంటి పిల్లలకు రోగం గురించి తెలియజేస్తే సులభంగా మనస్సుకు హత్తుకుంటుంది కాబట్టి రోగం మరింత ఎక్కువ అవుతుంది

ప్రశాంతమైన ప్రదేశం, ఉప్పుకలిసిన వేడినీటి స్నానం (ఒక్క బకెట్టుకు 1 1/2 - 2 చెంచాల ఉప్పు), కాళ్లు 5-7 నిమిషాలు వేడినీటిలో ఉంచడం, కప్పింగ్ (రక్తాన్ని లాగడం) వల్ల రోగికి గుణం కనిపిస్తుంది ఆస్త్మారావడానికి ముందులక్షణాలు కనిపించినప్పుడు ఆంటీ బయోటిక్కులు ఉపయోగించడం మంచిదికాదు

వైద్యులు చెప్పిన సలహా ప్రకారం సక్రమంగా ఔషదాలు ఉపయోగించడమేగాకుండా అలెర్జీలు కలిగించే వస్తువులను తినకుండా, ముట్టకుండా ఉండటం, ప్రత్యేక వ్యాయామం చేయడంవల్ల రోగాన్ని కొంతవరకు అరికట్టుకో వచ్చు రోగి ఊపిరితిత్తులలో బాగా ఒత్తిడి ఏర్పడేటట్టు గాలి పైకి వదలాలి ఈలవేయడం వల్ల, సంగీతం పాడటంవల్ల లేకపోతే ఒక గొట్టం ద్వారా ఊపిరివదలడంవల్ల ఉపశమనం కలుగుతుంది.

అన్నిటికంటే ముఖ్యం పరిసర వాతా వరణం శుభ్రంగా ఉండాలి అలెర్జీలు కలిగించేవిగా ఉండకూడదు

●

## ఆస్ట్రేలియాలో ఉన్ని ఉత్పత్తి

ఆస్ట్రేలియాలో ప్రపంచం చుట్టూ 100 చుట్లు చుట్టడానికి సరిపోయేంతటి రుమాలు అల్లడానికి సరిపోయేటంత ఉన్ని పాలిన తయారుచేయబడుతూంది.

## సిగరెట్లు కాల్చడం వల్ల ఆయువు క్షీణించిపోతుంది



*సిగరెట్లు కాల్చేవారు ప్రతీసారి సిగరెట్లు కాల్చినప్పుడు సుమారు 55 నిమిషాలు ఆయువు క్షీణింప చేసుకుంటున్నారు ఇది సిగరెట్లు కాలే సమయానికి సమానము. లండన్ రాయల్ కాలేజి ఆఫ్ ఫిజీషియన్స్ సమర్పించిన రిపోర్టు ప్రకారం సిగరెట్లు కాల్చేవారు తమ అలవాటును మానుకుంటే నిర్ణీతకాలం కంటే ముందుగా మరణించే ప్రమాదం 10 మొదలు 12 సంవత్సరాలలో అంతరించిపోతుంది*

**"ఏదేశం కూడా సాంస్కృతికంగా, ఆర్థికంగా ఏకాకిగా వర్థిల్లలేదు."**

# సీకాన్ సాగరగర్భంలో మిక్కిలి పొడవైన సొరంగం

సీకాన్ (SEIKAN) ప్రపంచంలో సముద్ర గర్భంలో మిక్కిలి పొడవైన సొరంగం 1988 మార్చి 13 న ట్సుగారు జలసంధులలో సముద్ర గర్భంలో సీకాన్ సొరంగం పూర్తి చేయబడింది. దీనితో జపాన్ ఆర్చిపెలాగోలో నాలుగు పెద్ద ద్వీపాలలో ఒకటి హొన్‌షూ, దానికి ఉత్తర దిక్కుగా ఉండే తరువాతి పెద్దద్వీపం హొక్కాయిడో చేర్చబడ్డాయి.


Seikan Undersea Tunnel

సీకాన్ సొరంగ నిర్మాణం 1963లో ప్రారంభమైంది ఇది మొత్తం 53 85 కి మీ ల పొడవు ఉంటుంది దీంట్లో 23 3 కి మీ లు సముద్ర గర్భంలో ఉంటుంది. ఇదే ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ పొడవైన సాగర గర్భసొరంగం. జలసంధుల అడుగున భూతలం క్రింద 100 మీటర్ల లోతుగా సొరంగం త్రవ్వబడింది సముద్ర తలం నుంచి దానిలోతు 140 మీటర్లు. ముఖ్యమైన ఈ సొరంగమార్గం గుండా రైలుదారి ఉంది. దీనికి అనుగుణంగా రెండు ఆక్జిలరీ సొరంగాలు ఉన్నాయి ఒకటి పైలట్ సొరంగం, రెండవది సర్వీసు సొరంగం

మొత్తం ఈ సొరంగాల పొడవు 100 కి.మీ.లు. భారవంతమైన సరకుల రవాణాలతో పాటు సీకాన్ సొరంగంలో ప్రయాణీకులకు సౌకర్యంగా రోజుకి 15 ట్రిప్పులు నిర్వహించబడతాయి.

## స్పృహ తప్పిన వారికి సంగీతం

*1976లో ఒక సైకిల్ ప్రమాదంలో స్పృహతప్పిన 10 సంవత్సరాల ఆంగ్లబాలికకు సంగీత శ్రవణంవల్ల ఆరోగ్యం కలిగి స్పృహవచ్చింది. 12 రోజులు స్పృహలేకుండా పడిపోయిన కాథరీన్ ఫిషర్‌కి ఆమె అభిమానించే సంగీతాన్ని వినిపించడానికి తలిదండ్రులు నిశ్చయించుకున్నారు వారు ఒక టేప్‌రికార్డును హాస్పిటల్‌కు తీసుకువెళ్లి ఆమెకు ఇష్టమైన డాన్స్‌పాటలు వినిపించిన వెంటనే ఆమె కళ్లు తెరిచి నవ్వింది. దీర్ఘకాలం స్పృహతప్పిపోయి ఉన్నప్పుడు మెదడులో నీరసించిపోయిన కొన్ని భాగాలు బాగా తెలిసిన సంగీతస్వరాల వల్ల తేరుకుంటాయని స్థానిక వైద్యులు చెబుతున్నారు.*

## వ్యక్తి వాస్తవ జీవితం వస్తువాహనాలు కాదు

*గ్రహించండి. దేనిమీదా ఆశవద్దు. ఒక వ్యక్తి యొక్క జీవితం అతడికి ఉన్నవస్తువుల మీదగానీ, సౌభాగ్యం మీదగానీ ఆధారపడి ఉండదు ఆ వ్యక్తి ఎంత ధనవంతుడైనా జీవితం ఆహారం కంటే గొప్పది శరీరం కట్టే బట్టలకంటే గొప్పది.*

*—జీసస్ క్రీస్తు*

**"జాతీయాభివృద్ధి దేశంలో విద్యాభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది."**

**—జె.ఎఫ్.కెన్నడీ**

# మీకు తెలుసా?

## మిక్కిలి ఖరీదైన వ్రాత కాగితం

యుఎస్ఎ న్యూయార్క్ ఫిఫ్త్ అవెన్యూలో కార్టియర్ ఇన్‌కార్పొరేషన్ వారు వ్రాసుకోడానికి అమ్మేకాగితం ప్రపంచంలో మిక్కిలి ఖరీదైనది. ఫిన్‌లాండ్ (యూరప్) లో చేతితో తయారైన ఈ కాగితం ప్రత్యేక వాటర్ మార్కుతో ఉంటుంది.

* * *

## ఆర్కిటిక్ మహాసముద్రంలో సాలీనా 16,000 మంచు దిబ్బలు లేస్తున్నాయి

ప్రతీ సంవత్సరం ఆర్కిటిక్ మహాసముద్రంలో 16,000 మంచు దిబ్బలు ఏర్పడుతున్నాయి. వీటిలో దగ్గరదగ్గర 400 న్యూఫౌండ్‌లాండ్(కెనడా ద్వీపదేశం) దక్షిణ వైపు మహాసముద్రంలో తేలుతూ ఓడ ప్రయాణాలకు ప్రమాదాలు కలిగిస్తుంటాయి.

* * *

## స్వాతంత్ర్య ప్రకటన తేదీ వారికి జయంతి ఉత్సవం

అమెరికనులు 1776 జూలై 4 వ తేదీ స్వాతంత్ర్యం ప్రకటించారు కాబట్టి ప్రతి సంవత్సరం జూలై 4 వ తేదీ స్వాతంత్ర్య ప్రకటన రోజుగా ఉత్సవం చేసుకుంటారు.

* * *

## మిక్కిలి పెద్ద, మిక్కిలి చిన్న అక్షర గుచ్ఛం

ఆంగ్లేయ భాష అక్షర సమామ్నాయంలో 26 అక్షరాలు ఉన్నాయి. 54 అక్షరాలు ఉన్న సింహలీస్ (శ్రీలంకా) భాష అక్షర సముదాయం మిక్కిలి పెద్దది. 12 అక్షరాలు మాత్రమే ఉన్న హవాయన్ భాష అక్షర సముదాయము మిక్కిలి చిన్నది.

* * *

## మొట్టమొదట ఇన్‌ఫ్లుయెన్జా

మొట్టమొదట ఇన్‌ఫ్లుయెన్జా వ్యాధి హిపోక్రేట్స్ (460-375 బిసి) చే బిసి 412 లో గుర్తించబడింది.

* * *

## ష్యూర్!



BERNARD SHAW

*ఒకసారి లిడెల్ హార్ట్ ఆంగ్లభాషలో షుమాక్ (Sumac), షుగర్ (Sugar) అనే రెండు పదాలే 'SU'తో ప్రారంభమై 'షు'గా ఉచ్చరింపబడతాయి గ్రహించావా అని షాని అడిగాడు దానికి షా ష్యూర్ (Sure) అని జవాబు చెప్పాడు!*

"ధర్మం ఎప్పుడూ నశించేది కాదు, ధర్మాచరణమాత్రం క్షీణిస్తూ వస్తుంది"

## భారతదేశంలో పశుసంపద

ప్రపంచ పశుసంపదలో నాల్గవ వంతు భారతదేశంలో ఉంది.

* * *

## పెన్సిల్వేనియా స్థాపకుడు

విలియం పెన్ ది క్వేకర్ యునైటెడ్ స్టేట్స్‌లో పెన్సిల్వేనియాను స్థాపించాడు. ఇతడు 293 సంవత్సరాలకుపూర్వం యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్‌ను సూచించాడు.

* * *

## 3,000 స్వేద గ్రంధులు

మన అరచేతి తలంలో ప్రతీ చదరపు అంగుళం చర్మంలోను 3,000 స్వేదగ్రంధులు ఉన్నాయి

* * *

## స్కాండినేవియాలో నాలుగు రాజ్యాలుచేరాయి

స్కాండినేవియా ఉత్తర యూరప్‌లో ద్వీప కల్పము. దీనిలో నార్వే మరియు స్వీడెన్ సామ్రాజ్యాలు చేరి ఉన్నాయి చారిత్రకంగా డెన్మార్క్ మరియు ఐస్లాండు కూడా స్కాండినేవియాలో చేరాయి. ఈనాలుగు రాజ్యాలు ఇప్పుడు దేనికదే స్వాతంత్ర్య సామ్రాజ్యంగా ఉంది.

* * *

## గాడిద జీవిత ప్రమాణం

సాధారణంగా గాడిద 20 సంవత్సరాలు జీవిస్తుంది. ముల్లంగి తింటే దీనికి జలుబు చేస్తుంది. బెల్లం అంటే చాలా ఇష్టం.

* * *

## చికరీ అంటే ఏమిటి?

చికరీ ఒకమొక్కజాతికి చెందినది. దీని వ్రేళ్లువేయించి పొడిగొట్టి కాఫీలో కలపడానికి ఉపయోగిస్తారు.



## రాజకీయరంగంలో సుప్రసిద్ధులు


John F. Kennedy

* *రోనాల్డ్ రీగన్ (1911- ) యునైటెడ్‌స్టేట్స్ (1981-89) 40వ అధ్యక్షుడు అవదవిలో ఉన్న మిక్కిలి వృద్ధుడు*

* *జాన్ఎఫ్.కన్నెడీ (1917-1963) యునైటెడ్‌స్టేట్స్ (1961-63) 35వ అధ్యక్షుడు. అవదవికి మిక్కిలి చిన్నవాడు మరియు అవదవిని అధిష్ఠించిన మొట్టమొదటి రోమన్ కాథలిక్.*

* *మార్గరెట్ థాచర్ (1925- ). యునైటెడ్‌కింగ్‌డమ్ మొట్టమొదటి మహిళా ప్రధానమంత్రి. 1979 నుంచీ అవదవిలో కొనసాగుతుంది 1979, 1983, 1987 ఎన్నికలలో వరుసగా ఎన్నుకోబడింది.*

"పెరటిలో ఉన్న కామధేనువును గుర్తించుకోలేక పాలకై పొరుగింటికి పరుగెత్తడం మానవ బలహీనత."

# హెూదా అవరోధం కలిగిస్తుందా?

హెూదా హద్దు మీరిపోతే హాస్యాస్పదంగా ఉంటుంది. ఈ రోజులలో కొంతమంది దీనిని వదులుకుని నిభాయించుకో గలుగుతున్నారు. ఎంతైనా వ్యక్తిగతంగా హెూదాతనం వల్ల మనలో చాలామంది దీనికి లోబడిపోయి సహజంగా



స్నేహభావం పెంపొందించుకోలేకపోతున్నారు. దూరంగా ఏకాంతంగా ఉంటాము. సరదాగా ఉండలేక పోతున్నాం.

ఇది ప్రయత్నించండి మీ అంతట మీకే తెలుస్తుంది. చివర సమాధానం చూడడానికి ముందు ప్రతీ ప్రశ్నకి 'అవునా, కాదా' అనే జవాబులు చెప్పుకోండి.

1. మిమ్మల్ని ఎవరైనా హాస్యంగా ఎగతాళి చేస్తే సహించగలరా?
2. మీరు చెప్పేది చేసేది అవివేకం అని మీరు గ్రహించినప్పుడు వాస్తవంగా హాస్యం అనిపిస్తుందా?
3. పార్టీలలో నష్టపోయే ఆటలలో పాల్గొన డానికి ఇష్టపడతారా?
4. ఏదైనా ఫాన్సీడ్రెస్ కార్యక్రమంలో గాని, ఇంకేదైనా వేడుకలో గానీ మీరు సరదాగా పాల్గొనగలరా?
5. తప్పుచేసినప్పుడు దానిని ఒప్పుకోడానికి భయంలేదని చెప్పగలరా?
6. చిన్నపిల్లలతో చేరి ఆడుకోడానికి ఇష్ట పడతారా?
7. ఎవరైనా యువకులు మీ అభిప్రాయాన్ని గానీ, మీ భావాన్ని గానీ విమర్శించడానికి అనుమతిస్తారా?
8. ఎవరైనా మిమ్మల్ని సరిదిద్దినప్పుడు గానీ, విమర్శించినప్పుడు గానీ సద్భా వంతో అంగీకరించగలుగుతున్నారా?
9 ఇతరుల ముందు డాన్సు నేర్చుకోడం, పాఠాలు నేర్చుకోడం, సంభాషణ నేర్చుకోడం వంటి పనులు చేయడం మీకు ఇష్టమేనా?
10 మీకు ఎదరయ్యే ప్రతిసమస్యను ఎదుర్కొని సాధించడానికి ఉత్సాహపడతారా?
11 నేను సహాయం చేయగలిగినంత వరకు నేను ఏంచేసినా నాకు లెక్కలేదు అను కునే వాళ్లలో మీరొకరా?
12 ఏదైనా పని పురమాయిస్తే అంగీకరించ గలరా? ఇష్టపడతారా?
13. మీపై మీకంటే చిన్నవారి పెత్తనానికి అంగీకరించి సంతోషపూర్వకంగా, సహకార భావంతో ఉండగలరా?
14. అవమాన పడకుండా, గౌరవహీనం అని అనుకోకుండా ఏదైనా అడిగి పుచ్చుకోగలరా?
15. లోకులు మిమ్మల్ని గురించి ఏమనుకున్నా సరే అని ఉదాసీనంగా ఉండగలరా?
16. ఏదైనా తప్పుని ఒప్పుకుని క్షమాపణ వేడుకోడానికి సిద్ధంగా ఉండగలరా?
17. వాగ్వాదం అయిన తరువాత తిరిగి మీరే మొదట ప్రస్తావనకు పూనుకుంటారా?

(మిగతా 39వ పేజీలో)

"అహంకార మమకారాలు వేరుపరుచుకుని దివ్యత్వంలో ప్రవేశించగలిగినప్పుడు ప్రేమతత్త్వం అలవడుతుంది."

# పౌరసత్వం

ప్రజాతంత్ర రాజ్యం సుస్థిరంగా ఉండాలంటే మంచి పౌరసత్వం ముఖ్యం అని మార్క్‌ట్వైన్ ఒకసారి చెప్పాడు ఈ పౌరసత్వం-నిర్మాణాత్మక చర్య, వ్యక్తిత్వం, సహనశీలత, నైతిక నిష్ఠ, ఉత్సాహం, నియమం, పోషణ, స్వయంశిక్షణ, నిజాయితీ, పట్టుదల, ఆత్మగౌరవం అనే గుణాలపై ఆధారపడి ఉంటుంది



పౌరుల నిర్మాణాత్మక చర్యను అనుసరించి పౌరసత్వపు యోగ్యత నిర్ణయించబడుతుంది. ప్రామాణికమైన పౌరుడు దేశంలో ఉత్తమోత్తమమైన సమాజాభివృద్ధికి అన్నివిధాల ఇంట్లో, బయట, ఉద్యోగ వ్యవహారాలలో నిరంతరం పాటు పడతాడు భక్తిశ్రద్ధలతో కష్టపడి పని చేసినప్పుడే సంక్షేమం సిద్ధిస్తుందని అతడికి తెలుసు

తమ హక్కుల భాద్యతలు తెలిసిన పౌరుల వ్యక్తిత్వం మీద ప్రజాతంత్ర రాజ్యం నెలకొల్పబడింది. ప్రామాణికమైన పౌరుడు తన బాధ్యతను గుర్తుంచుకోవాలి

సహనం అనేది పౌరసత్వానికి ప్రాతిపదికమైన పునాదిరాయి అభిప్రాయ భేదాలు, వివిధ వైఖరులు, వివిధ జాతులు, మతాలు, వివిధ విశ్వాసాలు, రకరకాల మనుష్యులు సర్వసాధారణం వీటిని సహించగల స్వభావం ఉండాలి. సహనం అంటే సత్యం, నీతి, ధర్మం వదలుకోవాలని కాదు పాపకర్మలు, అన్యాయం, విద్రోహక చర్యలు, దేశద్రోహం మొదలైన వాటిని సహించలేకపోవడం

నైతిక నిష్ఠ నైజమైన న్యాయశీలాన్ని తెలియజేస్తుంది కాయకష్టాలకు ఓర్చి శ్రమించే శ్రామికులమైనా, వ్యాపారం కొనసాగించుకునే వ్యాపా

(38 వ పేజీ తరువాయి)

18 తిప్పికొడితే దయతో మన్నించడం సులభం అనిపిస్తుందా మీకు?

19. అన్నిరకాల మనుష్యులతో వారి అభిమానాలను పంచుకుంటూ వారితో కలసిమెలసి ఉండగలరా?

20. మనస్సుకి ఏదీ పట్టించుకోలేనని చెప్పగలరా?

'ఔను' అనే ప్రతీదానికి 5 మార్కులు వేసుకోండి. 70 మార్కులు వస్తే మంచిది. 60-70 మధ్యవస్తే ఎక్కువ తృప్తికరం. 50-60 మధ్య వస్తే తృప్తికరం, 50 లోపువస్తే తృప్తికరం కాదు.

వ్యక్తిగతమైన ఆత్మాభిమానం పెరిగిపోవడం మానసిక లక్షణం. ఇతరులపై అభిమానంతో, వారి అభిరుచులకు అత్యంత ఆసక్తి దాయకంగా ఉండడానికి ప్రయత్నించండి. మీగురించి, మీసమస్యలకు ప్రాముఖ్యతను ఇవ్వవద్దు.

"భక్తికి మించిన దైవత్వంలో ఉండే ఆనందం ఇంకొకచోట కానరాకపోవడం పరమభక్తి."

రస్థులమైనా, ఉపాధ్యాయులమైనా, గృహిణుల మైనా, ఏరంగంలోనైనా మనం పురుషులుగా, స్త్రీలుగా గౌరవమర్యాదలతో సద్గుణశీలంతో అనుసరించవలసిన బాధ్యతలు ఉన్నాయి.

మంచి ఉత్సాహవంతులైన పౌరులతో పౌరసత్వం సజీవంగా ఉంటుంది. తీవ్రమైన భక్తి శ్రద్ధ, ఉత్సుకత తమ పనిపట్ల, దేశంపట్ల, భగవంతునిపట్ల ఉండాలి.

మంచిపౌరులు తమవిషయంలోను ప్రజల విషయంలోనూ ఒకనియమాన్ని పాటిస్తారు. ఇట్టి నియమాలు టెన్‌కమాండ్‌మెంట్స్‌లోను, గోల్డెన్‌రూల్‌లోను క్రోడీకరించబడ్డాయి.

పౌరులు తగిన పోషణతో ఒక స్వతంత్ర సమాజాన్ని చైతన్యవంతంగా ఉంచుకోవాలి. దేశంలో సామరస్యాభివృద్ధికి, భద్రతకు సహక రించి తోడ్పడాలి.

స్వాతంత్ర్యానికి, దిగ్విజయానికి స్వయం శిక్షణ ప్రాదివదికం. స్వయంశిక్షణ విస్తరించుకున్న ప్రజానీకంలో శాసనాలకి, చట్టాలకి అవసరం ఉండదు. ఇతరులకు హాని కలిగించకుండా, ఇతరుల మనస్సుకు నొప్పికలిగించకుండా మంచిమాటతో జీవితాలను నియంత్రించుకో గలిగినప్పుడు మనం యధార్థమైన స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నాం అన్నమాట.

మంచి పౌరసత్వానికి పౌరుల భావనలలో, మాటలలో, చేతలలో నిజాయితీ ప్రస్ఫు రిస్తూండాలి.

లొంగిపోకుండా అలసిపోకుండా ఉండటమే పట్టుదల. స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడానికి పౌరులు ఎంతో పట్టుదలతో ఉండాలి!

పౌరసత్వంలో గౌరవం లేక ఆత్మగౌరవం అంటే ఆత్మస్తుతి, అహంకారం, అహంభావంకాదు. సమాజంలో ప్రతీవ్యక్తికి స్వాభిమాన పూర్వక మైన గంభీరత, హోదాముఖ్యం. వ్యక్తిగతంగా ప్రతీపౌరుడు తన ఆత్మాభిమానాన్ని సంరక్షించు కుంటేనే తప్ప దేశం నశించిపోతుంది, స్వాతంత్ర్యం పోతుంది.

పౌరసత్వం ఇది దేశస్వాతంత్ర్యాన్ని సేవా ధర్మాన్ని సుస్థిరంగా నిలబెట్టగల బాధ్యత మీది త్వరపడండి.

రాబర్ట్‌జి బియర్స్ -'ఇన్‌స్పిరేషనల్ కోట్స్' సౌజన్యంతో

●

## మొధెరా సూర్యదేవాలయం A.D.1026లో నిర్మింపబడింది



*గుజరాత్ మొధెరాలో రాతిలో చెక్కబడిన సూర్య దేవాలయం ప్రాచీనకాలపు శిల్పుల హస్తకళానైపుణ్యాన్ని చాటుతూన్న అద్భుత దేవాలయం. ఇది AD 1026లో సోలంకి రాజవంశానికి చెందిన ఒకటవ భీమ్‌దేవ్ పరిపాలనా కాలంలో నిర్మించబడింది ఇందులో సభామంటపం బ్రహ్మాండమైన స్తంభాల సౌందర్యమే అని వర్ణించ బడింది అష్టభుజాకారంలో ఉన్న మంటపంలో నగిషీలు చెక్కిన ఆర్చిలు లోపల స్తంభాలపై ఉంటాయి ఈ దేవాలయం సూర్య భగవానుని శిల్పాలతో హృదయాహ్లాదకరంగా ఉంటుంది.*

"శ్రద్ధ, నిస్సంశయం ఉంటే మానవుని జీవితం గమ్యం చేరగలదు."

# ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన క్రిస్టమస్ ట్రీ

యుఎస్ఎ ఫ్లోరిడా లాంటానాలో నేషనల్ ఎన్‌క్వైరర్ ప్రధాన కేంద్రం ప్రదర్శించే క్రిస్టమస్ ట్రీ ప్రపంచంలో మిక్కిలి ఎత్తైనది. ఓర్‌గాన్ (Oregon) ప్రజలు ఫ్లోరిడా ప్రజలకు 102 అడుగుల ఈ డగ్లస్ ఫిర్ చెట్టును సద్భావ సూచనగా బహూకరించారు.ఈ వృక్షభారం 8000 పౌండ్లు. క్రింది కొమ్మలు 130 అడుగుల కైవారం విస్తరించుకుని ఉంటాయి

ఓర్‌గాన్ నుండి 3600 మైళ్ల దూరంలో ఉన్న ఫ్లోరిడాకు వచ్చి చేరిన దీని ప్రయాణం అనేక వింత వింత కథలతో, అద్భుతాలతో కూడుకుని ఉంది. ప్రకృతి శక్తుల ప్రభావం లేకుండా దీనిని ఒక బ్రహ్మాండమైన కొయ్య పెట్టెలో పెట్టారు. పెట్టెలో జాగ్రత్తగా పెట్టేముందు సంరక్షణకు ప్రత్యేక చర్యలు తీసుకోబడ్డాయి. ఆ తరువాత పాలిథీన్‌లో భద్రపరచబడింది పెట్టెలో అమర్చబడిన ప్రత్యేకమైన ఉష్ణ సాధనాలు వృక్షాన్ని రాకీ పర్వతాల దగ్గర ఎదురయ్యే శీతలానికి చెడిపోకుండా ఉంచాయి.

ప్రతీ సంవత్సరం 3/4 మిలియను మంది నేషనల్ ఎన్‌క్వైరర్ ప్రధాన కేంద్రాన్ని సందర్శిస్తారు. అందమైన పరిసరాలలో తోటల మధ్య పది అంతస్థులకు పైగా ఎత్తు ఉండే ఈ చెట్టుకి 14,000 దీపాలు, 2500 అడుగుల పెద్ద పెద్ద పుష్పమాలలు, 1000 రంగుల బంతులు, 200 రెడ్ బౌలు, 2003 ఫుట్ కాండీ కాన్స్, 100 పెద్ద స్నో ఫ్లేక్స్ ఉన్నాయి. ఈ చెట్టుపై మెరుస్తూన్న 6 అడుగుల నక్షత్రం ముఖ్యాలంకరణ.

—జ్యూడీ టుకెర్

## ఆచరణ యోగ్యమైన పని



ఆధ్యాత్మిక చింతనతో ఉండటమే మనం ముఖ్యంగా ఆచరించ వలసిన పని. దానికి ప్రత్యేక సమయం, సందర్భం, ప్రదేశం అవసరం లేదు ఇది వ్యక్తి నిత్యజీవితంలో దినచర్యకు ప్రతిబంధకంగా ఉండనక్కరలేదు ఆధ్యాత్మికంగా ఉండడానికి చాలా ఆలశ్యం, చాలాముందు అనేవి లేవు.

అనివార్యమనే భావనతో మారుతూన్న సమయం సందర్భం మరియు అమూల్యమైన సుస్థిరమైన విలువల పట్ల మనోభావనను కలిగించుకోవాలి.

ఆధ్యాత్మిక చింతనకు కట్టుబాట్లు లేవు. ఇతరులు దీనిని ఎక్కడా, ఎప్పుడూ నిర్బంధించలేరు. జీవిత కాలం అంతా ఉంటుంది నిస్వార్థమైన సేవానిరతి, స్వచ్ఛమైన అనంత ప్రేమానురాగాలతో అతి సులభంగా సాధించవచ్చు.

—అవతార్ మెహర్ బాబా

"బుద్ధిని ఆవరించిన అహంకారం నిర్మూలించుకుంటే
బుద్ధి దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది"

# అవీ - ఇవీ

## పర్వతారోహకులకు ఉపయోగపడే 'బైవాక్' వాచి

స్విస్ వాచి తయారీదారుడు సృష్టించిన బైవాక్ (Bivouac) వాచీ పర్వతారోహలకు,



వాయువిమాన సిబ్బందికి మరియు క్రొత్తదేశాలను వెదికే అన్వేషకులకు మిక్కిలి ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుంది. టైమును సూచించడమే గాక 'బైవాక్'కి బెరోమీటర్ మరియు సముద్రమట్టానికి పైగా ఎత్తును సూచించే ఆల్టిమీటర్ అమర్చబడి ఉంటాయి.

* * *

## వాషరీలలో వర్జింపబడిన బొగ్గునుండి విద్యుచ్ఛక్తి

వాషరీలలో నిరాకరింపబడి వర్జించిన బొగ్గునుండి విద్యుచ్ఛక్తిని జనింపజేయవచ్చు. వర్జింపబడిన ఈ బొగ్గులో 60 శాతం బూడిద ఉంటుంది కాబట్టి ఇది చాలా అనుకూల పంతమని పరిశోధనలు సూచిస్తున్నాయి. ఈ విధానాన్ని మొట్టమొదట భారతదేశంలో టాటా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీవారు ధన్‌బాద్ దగ్గర జామాడోబా వద్ద రూ. 20 కోట్ల వ్యయంతో వారి 10MW పవర్ ప్లాంటులో ప్రవేశపెట్టారు.

* * *

## బీడీల ఎగుమతి వల్ల రూ. 6 కోట్ల విలువచేసే విదేశీ మారకం

భారతదేశం గత మూడు సంవత్సరాలలో బీడీల ఎగుమతి వల్ల రూ. 6 కోట్లు పైగా విదేశీ మారకాన్ని గడించింది. 1988-89 లో ఇది రూ. 228.77 లక్షలు. గత మూడు సంవత్సరాలలో ఒక్క సౌదీ అరేబియాకు చేసిన బీడీ ఎగుమతుల వల్ల రూ. 1.65 కోట్లకు పైగా ఆదాయం లభించింది.

* * *

## కావాసాకీ - ప్రపంచపు మొట్టమొదటి సమాచార నగరం

జపాన్‌లో కావాసాకీ - ప్రపంచపు మొట్టమొదటి సమాచార నగరం (information city) 1995 లో సిద్ధమవుతుంది. ఎంత అధికంగా సమాచారం సిద్ధంగా ఉంటుందో దానిని బట్టే రేపటి ప్రపంచం నిర్ణయింపబడుతుంది. జపాన్‌లో 2000 AD నాటికి 75 సమాచార నగరాలు ఉంటాయి. ఫ్రాన్స్ 55 సమాచార నగరాలకు యోజనలు చేస్తూంది.

* * *

"సత్యం, ధర్మం రెండే విశ్వ మానవాళికి శాంతి మార్గ సాధనాలు."

## మాగ్నటిక్ బల్బు

ఫ్రాన్స్‌లో క్రొత్తగా కనిపెట్టబడిన మాగ్నటిక్ బల్బు సాకెట్ దగ్గరకు తీసుకువచ్చినప్పుడు దానంతట అదే సాకెట్ లోపలికి పోతుంది. బల్బు క్రింది భాగంలో ఉండేపింగాణీ తొడుగులో లోహపు వలక ఉంటుంది. దీని ప్లాస్టిక్ సాకెట్‌లో రెండు అయస్కాంత ముక్కలు పొదగబడి ఉంటాయి. దీనివల్ల మిక్కిలి అపాయకరమైన పరిసరాలలో బల్బులను అత్యధిక భద్రతతో నిరపాయకరంగా ఉపయోగించవచ్చు.

* * *

## జపాన్ - మిక్కిలి భాగ్యవంతమైన దేశము

నేడు జపాన్ అన్నిటికంటే మిక్కిలి అధికంగా భాగ్యవంతమైన దేశం. వీరి విదేశీ ఆస్తుల విలువ 291 బిలియన్ డాలర్లు.

* * *

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా ఉండే ఎలివేటింగ్ ప్లాట్‌ఫారం

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ మాన్నెస్ మాన్ డెమాగ్‌లో టెలిస్కోపిక్ క్రేన్‌కి ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా ఉండే ఎలివేటింగ్ ప్లాట్‌ఫారం అమర్చబడింది. దీనివల్ల ఎంత ఎత్తులోనైనా నిరపాయకరంగా పనిచేయవచ్చు ఎక్కడైనా అడ్డు తగిలినప్పుడు సెన్సార్లు అన్ని కదలికలను నిలిపివేస్తాయి.

* * *

## పిగ్మీలు 3 అడుగుల 3.4 అంగుళాలు ఎత్తు ఉన్నారు

అక్టోబరు 1970 లో దక్షిణ అమెరికాలో బొలీవియా, బ్రెజిల్ మరియు పెరూ సరిహద్దులలో 3 అడుగుల 3.4 అంగుళాలు ఎత్తుగా ఉండే ఒక పిగ్మి జాతి కనుగొనబడింది.

* * *

## చదరంగాన్ని ప్రదర్శించే ఆటోమేటిక్ టెలివిజన్

సోవియెట్ యూనియన్ ఉరాల్స్ (Urals) పెర్మ్‌యూనివర్సిటీ లో విద్యార్థులు చదరంగపు ఆటలను ప్రదర్శించే టెలివిజన్ విధానాన్ని కనుగొన్నారు. పావులకు అమర్చబడిన సెన్సారులు వివిద ఎత్తుల (నడక)ను రికార్డు చేసి ఒక ఎలక్ట్రానిక్ విధానానికి ప్రసరింప జేస్తాయి. తెరమీద స్క్రీన్ క్రీడా వ్యాసాన్ని ప్రదర్శించడమే గాక మొత్తం ఎత్తులను, ఆడినకాలాన్ని కూడా సూచిస్తుంది

## ముగ్గురు బాట్స్‌మెన్ 99 పరుగులు చేసి ఓడిపోయారు



1972-73లో ఇంగ్లండు మరియు పాకిస్తానుల మధ్య జరిగిన కరాచి టెస్ట్ (పాకిస్తాన్)లో మజీద్‌ఖాన్, ముస్తాఖ్ ముహమ్మద్, డెన్నిస్ అమీస్ అనే ముగ్గురు 99 పరుగులు చేసి ఓడిపోయారు.

"పొల్లు ఊదుకొని అటుకులు
నమిలితే తీపి దొరుకుతుంది."

# అహంకారం మరియు దురభిమానం

పి.పార్థసారధి

అహంకారం మరియు దురభిమానం అనేవి రెండు దుర్గుణాలు. ప్రపంచంలో మానవులందరూ ఈ రెండు గుణాల దుష్పలితాలను అనుభవిస్తున్నారేగానీ వాటిని వదల్చుకోలేక పోతున్నారు. ఒక్కొక్కప్పుడు కొందరు తాము సాధించిన దిగ్విజయాలకు గర్వపడటం




సహజం. అది మంచిదే. ఒకరు పొందిన విజయాలన్నీ పరమాత్మానుభూతివల్ల పొందినవే అనే అభిప్రాయం ఉంటే గర్వం కొంతవరకు తగ్గుతుంది.

ఇదేవిధంగా అసలు ఇష్టంలేని వారిపై మనకు ఉండే దురభిమానం విషయం కూడా. దురభిమానం పొందేటప్పుడు మరో సారి జాగ్రత్తగా ఆలోచించడం ముఖ్యం. అహంకారం, దురభిమానం చెందేముందు వివేకంతో ఆలోచించుకుంటే పెడదారిని పోము. జీవితంలో సంభవించే సమస్యలను ఎదుర్కొనేటప్పుడు తమ గురించి గానీ, ఇతరుల గురించిగానీ మాట్లాడేటప్పుడు కొంచెం నేర్పు, నైపుణ్యం అవలంబించక పోవడంవల్ల చాలామంది జీవితంలో తబ్బిబ్బులు పడి పోతుంటారు. ఇంకొకరి మనస్సులను నొప్పించి అహంకారంతో గర్వంచెందడం సులభమే. కానీ యోగ్యతకు మించి పొగడకుండా ఇతరులను సంతోషింపచేయడం కష్టసాధ్యం ప్రతీ పురుషునికీ, స్త్రీకి వారికి తగిన గౌరవ మర్యాదలు చూపగలిగితే వ్యక్తిగతంగానేకాదు, దేశాలమధ్యకూడా అపోహలకు, అపార్థాలకు తావు ఉండదు.

ప్రజలకు విద్య ముఖ్యం ఇప్పుడేకాదు ఎల్లప్పుడూ విద్య అవసరం. విద్య అంటే ఇంకొకరి మీద నిందమోపడానికి, అపకారం చేయడానికి అవకాశమియ్యని విద్య. పరస్పరం ఒకరినొకరు తెలుసుకుని సేవాసహాయం చేసుకోడానికి సహకరించే విద్య ఎంతో ముఖ్యం. ఇంకొకరి కంటే ధనవంతుడవనే అహంకారం ఉండకూడదు ఇతరులకు సహాయపడి అవసరమైన సేవచేయగల సహజగుణం కలవారు ఎవరైనా సుస్థిరమైన సౌభాగ్యం పొందగలరు.

●

**మెహబూబ్ ఖాన్ సినిమాలో ఎక్స్ట్రాగా ప్రారంభించాడు**

[illegible]

"శ్రద్ధ, స్థిరత్వం ఉంటే ఆసక్తి స్థిరపడుతుంది"

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## చెప్పేది చేసిచూపించు

ఒకరోజున ఒక నక్క, ఒక పిల్లి చేరి న్యాయాన్ని గురించి మాట్లాడుకుంటూ ప్రయాణం చేస్తున్నాయి. జీవితంలో అన్యాయంగా ఉండ కూడదు ఎప్పుడూ న్యాయంగా ప్రవర్తించడం ముఖ్యం సుమా అని నక్క అంది. 'కరుణ అనేది సద్గుణం సుమా' అంది పిల్లి. కొంతదూరం ప్రయాణం చేసిన తరువాత దారిలో ఒక తోడేలు తటస్థపడింది. గొర్రెల కాపరి శ్రమతో కన్నుమూసి నిద్రపోతూంటే తోడేలు ఒక గొర్రె పిల్లను నోటితో కరుచుకుని పరుగెత్తుతూంది. ఏమీతెలియని అమాయకగొర్రె పరిపరివిధాల కరుణించమని దీనాతిదీనంగా వేడుకుంది. తోడేలు విడవలేదు కదా నోటితో గట్టిగా కరిచి పెట్టి క్రూరంగా చంపి తినేసింది.

ఆ భయంకర దృశ్యానికి నక్క, పిల్లి భయపడి పోయాయి. 'శాకా సంబంధమైన దుంపలు, వేళ్ళు కావలసినన్ని లభిస్తూండగా మాంసం తినడం ఘోరం' అంది పిల్లి. 'ఔను నోరులేని గొర్రెపిల్లని చంపడం ఘోరమే' అంది నక్క.

అవి బహుదూరం ప్రయాణం చేసాయి. కొంతసేపటికి ఒక తోటలో కోళ్ళు గుంపుగా కనిపించాయి జిత్తులమారి నక్క చెప్పిన నీతి మరచిపోయింది. పరుగెత్తి అమాంతం కోడిపెట్టను నోటితో కరచుకుని విందు ఆరగించింది.

అదేసమయంలో పిల్లి తోటలో ఒక చిన్న ఎలుక తన బొరియలోనుంచి పైకిరావడం చూసింది వెంటనే దానిపైకురికి చంపి తినేసింది నక్క, పిల్లీ కూడా చెప్పిననీతులు విస్మరించాయి.

ఇతరులలో తప్పులను కనిపెట్టి వారిని దూషించనక్కరలేదు. మనలో ఎన్నో తప్పులు ఉంటాయి వాటిని తీర్చిదిద్దుకోవాలి చెప్పినది చేయడం నేర్చుకో

## మహాత్మాగాంధీ సూక్తులు



- ★ ఆధ్యాత్మిక తత్త్వసక యుద్ధములలో అవసరమైనది నిర్భయత్వం
- ★ ఉపాయం జాగ్రత్తగా గమనించుకుంటే లక్ష్యం దానంతట అదే సిద్ధిస్తుంది
- ★ యుద్ధం చేసేవాడికి ప్రయత్నమే విజయం. అతడికి అందులోనే సంతోషం.
- ★ సహన శక్తితో, ఓర్పుతో తాను బ్రతకాలి, ఇంకొకరిని బ్రతకనివ్వాలి.

"తనను తాను తెలుసుకున్నవాడే బుద్ధిమంతుడు"

# మేఘాలలో సంఘర్షణ

యునైటెడ్ స్టేట్స్ పెన్సిల్వేనియాలో పిట్స్‌బర్గ్ దగ్గర మిల్‌రన్ చుట్టుపట్ల జనం అనేకమంది 1874, జూలై 28 న మధ్యాహ్నం రెండు వింతమేఘాలు ఒకదానికొకటి ఎదురెదురుగా వస్తూన్నట్టు చూసారు. అవి దట్టమైన నల్లని ముద్దలు ప్రతీదానికి చుట్టూ ఒక



ఎర్రటి పట్టీ ఉంది ఒక మేఘం ఆకాశంలో ఈశాన్య దిక్కునుంచి వస్తూంది. రెండవది నైరృతి దిక్కు నుండి వస్తూంది మేఘాలలో సంఘర్షణ ఏర్పడుతూందని అనిపించింది. అసంభవం. మేఘాలు గాలితోపాటు ప్రయాణం చేస్తూంటాయి ఒకే మట్టంలో ఒకే కాలంలో గాలికి అభిముఖంగా వెళ్ళలేవు

భయంతో విస్మయం చెందిన ప్రజలు ఆకాశంలోకి చూస్తున్నారు. ఎర్రటి అంచులతో నల్లటి మేఘాలు ఒకదానికి ఒకటి దగ్గరకు చేరుకుంటున్నాయి రెంటిమధ్య పెద్ద మెరుపు మెరిసింది. ఒకదానికి ఒకటి కొట్టుకున్నాయి. 30 సెకండ్ల పాటు భయంకరమైన భీభత్సం. మెల్లిగా ఉధృతం తగ్గింది. చప్పుడు తగ్గింది. మేఘవిస్ఫోటనం ప్రారంభమైంది

కుండపోతగా బ్రహ్మాండమైన వర్షం కురిసింది. కొద్ది నిమిషాలలో కంచెలు కొట్టుకు పోతున్నాయి. పశువులు తేలిపోతున్నాయి, బ్రిడ్జిలు పడిపోయాయి ధారాపాతంగా కురిసిన వానకు 180 మంది జనం ప్రాణాలు కోల్పోయారు ఇది ఒక అపూర్వమైన సంఘటన

## భారతదేశంలో సాలీలు

*ప్రస్తుతం భారతదేశంలో 3 06 మిలియన్ కుటుంబాలు నేతపని చేసుకునే సాలీలు వీరిలో 2 63 మిలియను కుటుంబాలు గ్రామీణ ప్రదేశాలలో ఉన్నాయి సుమారు 0 74 మిలియను సాలీ కుటుంబాలు షెడ్యూల్డ్ జాతులకు, 0 37 మిలియను షెడ్యూల్డ్ తెగలకు చెందినవి*

*పూర్తిగా నేతపనిమీదే ఆధారపడిన 1 21 మిలియను మంది స్వంతంగా నేతపనులు చేసుకుంటున్నారు 0 45 మిలియను మంది సహకార సంఘాలలో పనిచేస్తారు 0 34 మిలియను మంది మాస్టర్ వీవర్స్ దగ్గర పనిచేస్తారు వీరు సంవత్సరానికి 194 రోజులు పనిచేస్తారు.*

*ఒక మిలియను కుటుంబాలకుపైగా నెలకురూ 100లు అంతకు తక్కువ ఆదాయం ఉంటుంది మొత్తం అన్నిరకాల ఆదాయాలు పరిశీలిస్తే ఒక్కొక్క కుటుంబానికి నెలకి రూ 715 ఆదాయం లభిస్తుంది*

*మొత్తం 3 61 మిలియను మగ్గాలు పనిచేస్తున్నాయి. 0 28 మిలియను మగ్గాలలో పని సాగటంలేదు*

*'ఆల్ ఇండియా హాండ్‌లూమ్స్ సెన్సెస్'*

*సౌజన్యంతో*

**"నీ ఆలోచనలు ఎక్కడ పుడుతున్నాయో అక్కడే ఉండిపో-అదే ధ్యానం."**

**—శ్రీరమణ మహర్షి**

# కలం స్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈశీర్షిక క్రింద ప్రచురింవబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. -సంపాదకుడు]

1. ఎ. శ్రీనివాస్, బి.ఎస్.సి, 22 సం.లు, C/O రాజరాజేశ్వరి కిరాణం, 5 ఇంక్‌లైన్స్, సూపర్‌బజార్, గోదావరిఖని (కరీంనగర్ జిల్లా) 505 214.
   వింత విషయాల సేకరణ, ఫోటోగ్రఫీ, పత్రికలు చదవడం.

2. డి.జి. శ్రీనివాస్, S/O కృష్ణమూర్తి శర్మ, రామాయం పేట (మెదక్ జిల్లా), 502 101.
   పత్రికలకు లేఖలు వ్రాయడం, రేడియో వినడం.

3. టి ఎస్.చెల్లారెడ్డి, ఇం.నెం. 9-62, మునసబు వీధి, అనపర్తి (తూ.గో.జిల్లా), 533 342.
   కలం స్నేహం, చదవడం, ఆటలు.

4. కె.వి.ఎస్.భాస్కర్రావు, 29 సం లు, సినీ రచయిత, సహకార దర్శకులు, 25, కోలమని అమ్మన్ కోయిల్ స్ట్రీట్, టి.నగర్, మద్రాస్-600 017.
   రచనలు చేయుట, కవితలు వ్రాయుట, కలంస్నేహం.

5. టి.వేణుగోపాల్, 19 సం.లు, S/O టి.నవారయ్య పేరూర్ గ్రామము, దేవర కద్రమండలం, (మహబూబ్‌నగర్‌జిల్లా) 509 219.
   ప్రకృతి ఆరాధన, నవలలు చదవడం, టివి వార్తలు వినడం.

6. ఎస్.రాజేందర్ (టీచర్), బి.ఏ., C/O ఎస్.రవీందర్‌రావ్ (ఫోర్‌మెన్) హిందూస్థాన్ లాల్‌పెట్ ఓపెన్ కాస్ట్‌మైన్, ఎస్.ఎ.నెం. 3 పోస్టు మరియు జిల్లా చంద్రాపూర్ (మహారాష్ట్ర) 442 507.
   క్రికెట్ ఆడటం, పుస్తక పఠనం, దైవభక్తి.

## పంజాబ్‌లో వరి ఉత్పాదన అత్యధికం



*వరి ఉత్పాదన పశ్చిమ బెంగాల్‌లో హెక్టేరుకి 1555కి గ్రా.లు, మధ్యప్రదేశ్‌లో హెక్టేరుకి 1161-కి గ్రా లు, ఒరిస్సాలో హెక్టేరుకి 1191 కి.గ్రా.లు మరియు భారతదేశపు సగటు ఉత్పాదన హెక్టేరుకి 1568కి గ్రా.ల తో పోలిస్తే పంజాబ్‌లో వరి ఉత్పాదన చాలా అధికం-హెక్టేరుకి 3199 కి గ్రా లు.*

-'యోజనా' సౌజన్యంతో

"ఎవరి వ్యామోహం వారికి తెలియడం కష్టం.
ఒకరి వ్యామోహం ఇంకొకరికి తెలియడం చాలా సులభం."

7. రాజవన్నెల రాజు, ఇంటర్ MPC, గౌతం ట్యూషన్ హౌస్, విద్యానగర్, ఆంధ్రా బాంక్ దగ్గర, గోదావరిఖని (కరీంనగర్ జిల్లా) 505209.
   హైడ్రోజన్ బాంబులను గూర్చి తెలుసుకొనుట.

8. షాఫియుల్లా, టైపిస్ట్, పి.ఒ.బి. 830 అల్-ఖోబర్, కె.ఎస్.ఎ. 31952.
   మంచి స్నేహితులతో కలం స్నేహం, నవలలు, వార్తాపత్రికలు, పుస్తకాలు చదవడం.

9. సి. జాఫర్ హుసేన్, సూపర్‌వైజర్, పి.ఒ.బి. 375 అల్ - ఖోబర్, కె.ఎస్.ఎ. 31952.
   కలంస్నేహం, తెలుగు సినీమాలు చూడడం.

10. పి. వెంకటరమణ (రాము) డిసిఇ ఫైనల్, S/O సూర్యనారాయణ, చినగెద్దాడ గ్రామం, రంపచోడవరం పోస్టు, (తూ.గో. జిల్లా) 533 288.
    పుస్తకపఠనం, వాలీబాల్, క్రికెట్ ఆడటం.

11. షేక్ మౌలాలి సాహేబ్, వాచ్‌మెన్, జిల్లా ప్రజాపరిషత్ (బాలుర) హైస్కూల్, గిద్దలూరు, (ప్రకాశం జిల్లా) 523 357.
    కలంస్నేహం, పుస్తకాలు చదవడం.

12. మురకొండ రాంబాబు, ఇంటర్, 17 సం.లు. S/O కోటేశ్వరరావు, గింజుపల్లి వారి పాలెం, మల్లాయపాలెం పోస్టు, ప్రత్తిపాడు మండలం, (గుంటూరు జిల్లా) 522 019.
    ప్రకృతి ఆరాధన, క్రొత్తప్రదేశాలు చూడటం, వింతవిషయాలు సేకరించడం.

## పారిశ్రామికాభివృద్ధిపొందిన దేశాలలో జీవితకాలపరిమితి

*పారిశ్రామికంగా అభివృద్ధి పొందిన దేశాలలో 2000 సంవత్సరం నాటికి మానవ జీవితకాల పరిమితి 75-80 సంవత్సరాలు, అభివృద్ధి పొందుతూన్న దేశాలలో 65 సంవత్సరాలు ఉంటుందని ప్రపంచ ఆరోగ్యసంస్థవారు ప్రకటించారు*

## ఎలా?

## పాములవాళ్లు పాములను ఎలా ఆడిస్తారు?



*సామాన్యంగా పాములవాళ్లు పాములను ఆడించడం వంశపారంపర్యంగా తండ్రి నుంచి కొడుకు నేర్చుకుంటాడు. వీళ్లు పాములను పరిశీలిస్తూ వాటి అలవాట్లను గ్రహిస్తారు నిరపాయకరంగా ఉండడానికి పాముల కోరలను తీసేస్తారు సంగీతం పాడుతూ పాములను ఆడిస్తూ చుట్టూమూగిన జనానికి ఆనందం కలుగజేస్తారు కొంతమంది పాములవాళ్లు పాములకు ముంగిసలతో పోట్లాడటం నేర్పిస్తారు. ముంగిసలు సాధారణంగా పెద్దపెద్ద విషపాములను కూడా చంపేస్తాయి.*

"మానవ ప్రగతికిగాని, దేశప్రగతికి గానీ అసంతృప్తి మొదటి అంతరాయం."

# స్టాంపు విలువ 400,000 పౌండ్లు

1856కు చెందిన బ్రిటిష్ గుయానా ఒక సెంటు నల్ల స్టాంప్ విలువ నేడు 380,000 పౌండ్లు. ఇంత విలువైన స్టాంప్ ప్రపంచంలో ఎవరి దగ్గర ఉంది? అది అతి జాగ్రత్తగా కాపాడుతూ వచ్చిన ఒక రహస్యం.

లండన్‌లో అచ్చువేయబడే స్టాంపులు సకాలంలో అందకపోవడం చేత 1856 లో తాత్కాలికంగా అచ్చువేసుకున్న 1 సెంట్ మరియు 4 సెంట్ల విలువగల స్టాంపులలో ఒక సెంట్ గుయానా (One Cent Guiana) ఒకటి.

ఈ స్టాంపును ఒక స్కూలు విద్యార్థి 1873లో కనుగొన్నాడు ఇతడు దీనిని ఒక వ్యాపారస్థుడికి ఆరు షిల్లింగులకు అమ్మాడు. యాభై సంవత్సరాల తరువాత ఆర్థర్ హింద్ అనే అమెరికా మిలియనీరు విద్యార్థి అమ్మినదానికి 24,000 రెట్లకుపైగా 7,300 పౌండ్లకు కొన్నాడు.

1940 లో ఇది తిరిగి అమ్మబడింది. ఫిన్‌బార్ కెన్నీ అనే అతను కొన్నాడు. ఎంతకు కొన్నాడో ఎవరికీ తెలియదు.

1940 నుంచి ఏ కొద్దిసార్లో ప్రదర్శనలలో ఇది ప్రదర్శింపబడింది. 1966 లో లండన్ వాటర్లూ ఫెస్టివల్ హాల్‌లో జరిగిన మొట్టమొదటి 'స్టాన్లీ గిబ్బన్స్' స్టాంప్ కాటలాగ్ వార్షికోత్సవంలో ఒకసారి ప్రదర్శింపబడింది.

1856, ఏప్రిల్ 4 తపాలా ముద్ర ఉన్న ఈ స్టాంప్‌ను ఇర్విన్ ఆర్ వీన్‌బెర్గ్ సిండికేట్, న్యూయార్క్ నగరంలో వాల్ డోర్ఫ్-ఆస్టోరియాలో ఒక అనామకుడికి 1980 ఏప్రిల్ 5న 3,80,000 పౌండ్లకు విక్రయించబడింది.

ఈనాడు 400,000 పౌండ్ల విలువతో 'బ్రిటిష్ గుయానా 1856' 1సెంట్ మాగ్నెటా పరిమాణం లోను, విలువలోను అమూల్యమైనది.

## నియంతృత్వం స్థిరం కాదు

నియంతృత్వం-ఒక మనిషిని ఆరాధించడం-ఇది స్థిరం కాదు. సమాజంలో ప్రజ తమ అభిప్రాయాలను చెప్పుకోడానికి వీలు ఉండదు. అటువంటి సమాజం చిరకాలం ఉండదు.

—విన్‌స్టన్ చర్చిల్

## ఆదర్శవంతులుగా ఉండాలి



చిన్నపిల్లలు సాధారణంగా వారి పరిసరముల వల్ల, వారి పెద్దల వల్ల ప్రభావితులు అవుతూంటారు కోపంతో కెవ్వుమని గట్టిగా అరిస్తే మీ పిల్లలకు ఏం చెప్పగలవు? ఏం నేర్పగలవు? భయపడిపోయి నిరుత్సాహంతో ఆవేశపడిపోతే మీ పిల్లలకు ఆదర్శవంతుడుగా ఎలా ఉండగలవు? నీవు నీ పిల్లలకు చెప్పదలచుకున్న గుణాలు నీలో లేవు. కాబట్టి నీ పిల్లలు ఎలా ఉండాలని అనుకుంటావో అలా ప్రవర్తించడం ఉత్తమం. నీ జీవిత విధానాన్నే వారు తమస్వంతం చేసుకుంటారు.

—స్వామీ సత్యానందసరస్వతి

"రోగం ఏదేశంలో పుడుతుందో ఆదేశంలోనే మందుకూడా ఉంటుంది."

# పరమాత్ముని అనుగ్రహమే యదార్థమైన సంపద

నీవు ఆర్జించే సంపద యదార్థమైన సంపద కాదు! యదార్థమైన సంపద పరమాత్ముని అనుగ్రహం. పరమాత్ముని అనుగ్రహం పొందడానికి యత్నాలు కొనసాగించాలి. ఇతరులకు సహాయపడటంకంటె గొప్ప ప్రయత్నం ఇంకొకటి లేదు. హృదయం నిష్కలంకంగా లేకుండా చేసే భక్తి భజన, దివ్యనామ సంకీర్తన, మంత్రజపం, ధ్యానం మొదలైనవన్నీ వ్యర్థం.

భోజనానికి నీవు అన్నం వండి సిద్ధంచేసుకున్నావనుకో, మంచిరకం తాజావస్తుసామాగ్రి కొంటావు. వండుకుంటావు. రుచికరంగా ఆరగించడానికి ప్రారంభిస్తావు. కాని ఏదో అసంతృప్తి. మనశ్శాంతి ఉండదు. వస్తువులన్నీ శుభ్రమైనవే వసందైనవే. మరి ఎందుకు ఈ బాధ, అసంతృప్తి. వంటపాత్రలు శుభ్రంగా లేవా? నీవు నిష్ఠగా భజన చేస్తున్నావు, జపం చేస్తున్నావు, ధ్యానం చేస్తున్నావు. ఇవన్నీ కూడా భోజనాన్ని తయారు చేయడానికి కావలసిన వస్తుసామాగ్రి వంటివి కానీ నీ హృదయం (వంటపాత్ర) శుభ్రంగా, నిష్కలంకంగా లేకపోతే అంతా వ్యర్థమైపోతుంది

నిరహంకారమైన సేవోపాసన వల్ల పరమాత్ముని అనుగ్రహం సులభంగా పొందగలుగుతావు వట్టిమాటలతో, ప్రసంగాలతో కాలం వృథా చేయకు. దానిబదులు సంఘసేవకు, ప్రజాసేవకు పూనుకో నీవు సేవచేసినప్పుడే నీ ప్రసంగానికి విలువ ఉంటుంది. ఇతరులపై ప్రభావం ఉంటుంది.

శ్రీసత్యసాయిబాబా

## మిక్కిలి పెద్ద ఆధునిక కళావస్తు ప్రదర్శనశాల

*ఫ్రాన్స్ పారిస్‌లో బియోబోర్గులో ఉన్న జార్జెస్ పాంపిడో నేషనల్ సెంటర్ ఫర్ ఆర్ట్ అండ్ కల్చర్ ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఆధునిక కళావస్తు ప్రదర్శనశాల బ్రహ్మాండమైన 17,700 మీటర్ల ఈ ప్రదర్శనశాల 1977 లో ప్రారంభింపబడింది*

## ముఖం వాడిపోకుండా నవనవలాడుతూ ఉండాలంటే



*పందిరి దోసకాయ ముక్కలతో ముఖం రుద్దుకుంటే అది చర్మాన్ని శుభ్రపరచి చల్లగా, తాజాగా ఉంచుతుంది ముఖం వెచ్చని నీటితో కడుక్కో. నాలుగైదు దోసకాయ ముక్కలు తీసుకో ముఖం అంతా వాటితో తోముకో తరువాత శుభ్రమైన చన్నీటితో ముఖం కడుక్కో. ముఖం నవనవలాడుతూ చల్లగా హాయిగా ఉన్నట్టు అనిపిస్తుంది.*

"జీవితం ఉత్తేజవంతం, ఇతరులకోసం జీవించగలిగితే మరింత ఉత్తేజకరంగా ఉంటుంది"

—హెలెన్ ఆడమ్స్ కెల్లర్

# వీరిని గురించి తెలుసుకోండి

డేమ్ అగాథా క్రిస్టీ: ప్రముఖ నవలా రచయిత్రి ఈమె 147 కధానికలు, 15 నాటకాలు


AGATHA CHRISTIE

మరియు 90 నవలలు రచించింది. ఇవన్నీ 45 భాషలలో 2000 మిలియను కాపీలు అమ్ముడైనాయి!

* * *

ఇర్వింగ్ వాలెస్: ప్రపంచంలో అత్యధికంగా చదవబడే నవలా రచయిత. ఇతడు రచించిన 35 నవలలలో 'ది చాప్‌మాన్ రిపోర్టు', 'ది ప్రైజ్', 'ది త్రీ సైరెన్స్', 'ది మిరకిల్ అండ్ ది సెవెన్త్ సీక్రెట్', చాలా ప్రసిద్ధి చెందినవి

* * *

మౌలానా అజాద్: ప్రఖ్యాత స్వాతంత్ర్య యోధుడు. ఇస్లాం వాఙ్మయంలో గొప్ప పండితుడు. హిందూస్థానీ భాషలో ఉపన్యాసకుడుగా పేరు పొందాడు. ఉన్నత భావాలకు ఇతడు ప్రసిద్ధి పొందాడు. స్వాతంత్ర్యానంతరం 1947 లో కేంద్ర మంత్రివర్గంలో విద్యాశాఖా మంత్రి పదవిని అధిష్ఠించాడు.

* * *

డైగో వెలాజ్ క్వెజ్ (1599-1660): సుప్రసిద్ధ స్పానిష్ చిత్రకారుడు చిత్రాన్ని చిత్రించేటప్పుడు వారివారి వ్యక్తిత్వాన్ని వశం చేసుకుంటాడు. 'ది మెయిడ్స్ ఆఫ్ ఆనర్' అని చెప్పబడే ఇతడి లాస్ మెనినాస్ గ్రూపు పిక్చరు ప్రపంచ ప్రసిద్ధి పొందింది.

* * *

వర్జిల్ (70-19 బిసి): ప్రాచీన రోము పండితుడు. 'ఏనీడ్' (Aenerd) అనే మహాకావ్యాన్ని సృష్టించి రోము ప్రజలకు ప్రముఖ స్థానాన్ని ఏర్పరచ గలిగాడు రచనలలో పరిపూర్ణతను సాధించాడు.

* * *

ఆండ్రూ జాక్సన్: (1767-1845). యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా ఏడవ అధ్యక్షుడు ఇతడు 1828లో, 1832లో అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు నిరుపేద కుటుంబంలో జన్మించిన వాడు. ఇతడు పుట్టక ముందే తండ్రి మరణించాడు.

* * *

**వైద్యుని ధర్మాలు**

ఆత్మశ్రేయస్సుకే కాదు, స్వలాభం కోసం కాదు. వ్యాధిగ్రస్తులైన రోగుల ఆరోగ్యాభివృద్ధికే చికిత్సచేసి గౌరవం పొందాలి.

—చరక సంహిత

"పారిశ్రామిక యుగానికి క్రొత్తక్రొత్త అవసరాలను సృజించుకోడంలో విశ్వాసం ఉంటుంది."

—డా.ఎస్.రాధాకృష్ణ

మోలియర్ (1622-1673).సుప్రసిద్ధ ఫ్రెంచి కామెడీ నాటక కర్త. టార్ టుఫీ (1644), లె మిసాన్త్రోప్ (ది మైజర్, 1666) లె మాలాడె ఇమాజినైర్ (ది ఇమాజినరీ ఇన్‌వాలిడ్, 1673) ఇతడి ముఖ్యరచనలు. ఇతడి నవలలలో సమాజంలో ప్రజల హాస్య ప్రవృత్తిని చిత్రీకరించాడు

* * *

ఆర్సన్ వెల్లెస్: సుప్రసిద్ధ హాలీవుడ్ ఆక్టర్ మరియు డైరక్టరు. 'సిటిజన్ కేన్' అనే క్లాసిక్ పిక్చరును సృష్టించాడు. 'ఎ టచ్ ఆఫ్ ఈవిల్' 'దిట్రయల్', 'లేడీ ఫ్రమ్ షాంగై','మాక్‌బెత్' ఇతడి ప్రఖ్యాత సినీమాలు

* * *

ఫ్రెడ్ ట్రూమన్: ఆంగ్లేయ క్రికెట్ యోధుడు క్రికెట్ క్రీడారంగంలో ఫాస్ట్‌బౌలర్‌గా ప్రసిద్ధి పొందాడు. ఇతడు 307 టెస్ట్‌వికెట్లు తీసి ప్రపంచరికార్డును స్థాపించాడు

* * *

సి.ఎస్.వెంకటరావు(క్రీ.శ.1885-1945): ఆంధ్రదేశంలో ప్రసిద్ధి కెక్కిన చిత్రకారుడు. ఇతడి ధ్రువనారాయణ, శ్రీరామపట్టాభిషేకము, కురుక్షేత్రం, లంఖిణీ సంహారము మొదలైన తైలవర్ణ చిత్రాలు ఇతడి భావనా కౌశల్యాన్ని ప్రదర్శిస్తాయి. స్వీయ ప్రతిభతో క్రొత్త పోకడలతో చిత్రించగల సిద్ధహస్తుడు. ఇతడి చిత్రాలు హైదరాబాద్ సాలార్‌జంగ్ మ్యూజియంలో భద్రపరచబడ్డాయి. జీవితం చివరి కాలంలో 400 చిత్రాలు చిత్రించాడంటారు వీరి 'గౌతమీ అవతరణం' రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌కి బహూకరించబడింది.

* * *

శ్రీధర వేంకటేశ్వరయ్య : పూర్వం దక్షిణ దేశంలో తంజావూరు పాలించిన మహారాష్ట్ర వంశానికి చెందిన శాహజీ(1684-1740) పోష్య వర్గంలోనివాడు. ఈయననే వెంకటేశయ్య అయ్యావాళ్(అయ్యగారు) అంటారు. తమ సమకాలీనుడైన బోధేంద్రునితో భక్తి సాంప్రదాయానికి చెందిన పూజా పద్ధతిని తమిళనాడులో వ్యాపింపచేసాడు. ఈ పద్ధతి ప్రకారం భాగవతం కీర్తనం చేయడం వల్ల, భగవన్నామం జపించడం చేత ముక్తి సులభసాధ్యమని వీరి విశ్వాసం. గొప్ప మహిమలు కలవాడు. శాహేంద్ర విలాసం అనే గ్రంథం రచించాడు తమిళనాడులో వీరిని స్మరింపకుండా భజనలు ఉండవు భజనగోష్టులు ఈయన స్తోత్రాలతో ప్రారంభమవుతాయి.

## 8,300 మీటర్ల లోతున చేపలు నివసిస్తాయి



*చేపలు సజీవంగా నివసించగల మిక్కిలి లోతైన ప్రదేశం అట్లాంటిక్ మహాసముద్రంలో పుయెర్టో రికో ట్రెన్చ్ ఇది 8,300 మీటర్ల లోతున ఉంది. బాసియోగిగాస్ (bassiogigas) అని చెప్పబడే ఈచేపలు 16.5 సెం మీ.ల పొడవుగా ఉంటాయి.*

"ఆటమైదానంలేని పాఠశాల పూజారిలేని గుడి, మెషీన్ లేని మెషీన్‌షాపు."

# ప్రపంచంలో మిక్కిలి పెద్ద స్టాట్యూ

యునైటెడ్‌స్టేట్స్ న్యూయార్క్ హార్బర్‌లో ఉన్న స్టాట్యూ ఆఫ్ లిబర్టీ ప్రపంచంలో మిక్కిలి పెద్ద విగ్రహం యూరప్‌నుంచి న్యూయార్క్ దరిదాపులకు వచ్చే ప్రయాణీకులు అందరికీ ఇది కనిపిస్తుంది లిబర్టీద్వీపం అనే చిన్న భూభాగంలో నిర్మించబడింది. ఇది ఫ్రెడెరిక్ ఆగస్టే బార్తోల్డీ అనే సుప్రసిద్ధ ఫ్రెంచిశిల్పి



అపూర్వ హస్తకళానైపుణ్యం. నేడు ఒక బ్రహ్మాండమైన జాతీయ చిహ్నమైన ఈలోహ విగ్రహాన్ని 1884 లో అమెరికా స్వాతంత్ర్య ప్రకటన 100వ వార్షికోత్సవ సందర్భంలో ఫ్రెంచివారు అమెరికాకు బహుమానంగా ఇచ్చారు.

ఇది లోహంతో తయారైన స్త్రీ విగ్రహం. దీనిని 'లేడీ లిబర్టీ' అనికూడా అంటారు. ఈ విగ్రహం స్వాతంత్ర్యానికి చిహ్నం. విగ్రహం చేతిలో ఉన్న పలకమీద స్వాతంత్ర్యప్రకటన తేదీ గుర్తింపబడి ఉంటుంది పైకి ఎత్తబడిన రెండవచేతిలో జ్యోతి ఉంటుంది.

ప్రాచీన ఏడు ప్రపంచ అద్భుతాలలో ప్రఖ్యాతి పొందిన రోడ్స్ కొలోసస్ ఎత్తు 105 అడుగులు. కానీ ఈలిబర్టీ శిలావిగ్రహం పాదాల నుంచి జ్యోతి చివరదాకా151 అడుగుల ఎత్తుగా ఉంటుంది పదకొండు కోణాల నక్షత్ర రూపంలో ఉన్న 154 అడుగుల ఎత్తుగా ఉండే నల్లరాతి అరుగుమీద ఈ విగ్రహం స్థాపించబడింది నల్లరాతి అరుగులోనూ, విగ్రహంలోనూ కిరీటం దగ్గరఉండే పరిశీలనా వేదిక వరకు మెట్లు నిర్మించబడ్డాయి.

ఈ విగ్రహం చేతిపొడవు 16 అడుగుల 5 అంగుళాలు. చూపుడువేలు మాత్రమే 8 అడుగులు ఉంది. వ్రేలిగోరు 13 అంగుళాల పొడవు, 10 అంగుళాల వెడల్పు ఉంది ముక్కు 4 అడుగుల 6 అంగుళాలు. కుడిచేయి పొడవు 42 అడుగులు. ఒక్కొక్క కన్ను వెడల్పు 2 1/2 అడుగులు.

## మురుగునీటి శుద్ధీకరణ ప్లాంటు

ప్రపంచంలోనే మొట్టమొదటిది అని చెప్పుకోతగ్గ మురుగునీటి శుద్ధీకరణ ప్లాంట్ హైదరాబాద్ పొలిమేరల్లో ఏర్పాటు చేయబడింది. రోజుకు ఈ ప్లాంట్ 600 ఘనమీటర్ల మురుగునీటిని శుభ్రపరచ డానికి రూపొందించబడింది. ప్రస్తుతం ఇక్కడి పారిశ్రామిక వాడలలో పారిశ్రామిక సంస్థలు వదిలే మురికినీరు హైదరాబాద్ హుస్సేన్‌సాగర్‌లోకి ప్రవహించే నాలుగు కాలువలలో ఒక కాలువగుండా ప్రవహిస్తూ త్రాగే మంచినీటిని కాలుష్యం చేస్తున్నాయి.

—'సి ఇ.ఇ.ఎస్.ఎఫ్.ఎస్' సౌజన్యంతో

"ఆరోగ్యం ఉన్నవారికి అపేక్ష ఉంటుంది. అపేక్ష కలవారికి అన్నీ ఉంటాయి."

—అరేబియన్ సామెత

విగ్రహం మిశ్రమలోహంతో తయారుచేయబడింది. మొత్తం అయిదు వంతుల్లో మూడు వంతులు ఇనుము, రెండువంతులు రాగి మిశ్రమం ఉపయోగించబడింది. దీని మొత్తం భారం 200 టన్నులు పైగా ఉంటుంది. 40 మంది జనం తలలో, 12 మంది జ్యోతిలో నిలబడవచ్చు. క్రింది అరుగు నుండి తలదాకా విగ్రహంలో 161 మెట్లు ఉన్నాయి. పైకెత్తిన చేతిలో ఉన్న నిచ్చెనలో 54 మెట్లు ఉన్నాయి. తలపైన ఉన్న నక్షత్రంలో 11 మొనలు ఉన్నాయి. విగ్రహం తయారుచేయడానికి 50,000 పౌండ్లు ఖర్చయింది. క్రింది అరుగుకి మరో 70,000 పౌండ్లు ఖర్చయింది.

దీని నిర్మాణం 1874 లో ప్రారంభించబడింది. రెండు సంవత్సరాల తరువాత ఈ స్మారక చిహ్నంలో మొదటిభాగం, జ్యోతితో ఎత్తిన హస్తం పారిస్‌లో చేయబడి అమెరికాకు పంపబడింది. 1875లో శిరస్సు భాగం పూర్తికావింపబడి పారిస్‌లో ప్రదర్శింపబడిన తరువాత అమెరికాకు పంపబడింది. 1883 నాటికి విగ్రహనిర్మాణం పూర్తికావింపబడింది. ఆ తరువాత బ్రహ్మాండమైన క్రింది అరుగు నిర్మాణం ప్రారంభింపబడింది.

ఈ అపూర్వ విగ్రహ నిర్మాణానికి బార్తోల్డీ తన తల్లిని మోడల్‌గా పెట్టుకున్నాడు. మొట్ట మొదట 7 అడుగుల ఎత్తు మోడల్ తయారుచేసి తరువాత దానిని పెద్దది చేసాడు విగ్రహం 350 అంశాలుగా చేయబడింది. వీటిలో కొన్ని 9000 ప్రత్యేక ప్రమాణాలలో ఉన్నాయి మొట్ట మొదట ప్లాస్టర్‌తో మోడల్స్ తయారుచేయబడ్డాయి. ఇవిపూర్తి అయిన తరువాత వడ్రంగులు కర్రతో మోడల్స్ తయారుచేసారు. దీనిపైన రాగిరేకులు మోల్డ్‌చేయబడ్డాయి. పై మెరుగులకు చిన్నచిన్న సుత్తులు ఉపయోగించబడ్డాయి.

ఫ్రాన్స్‌లో తయారైన ఈ విగ్రహం ఫ్రెంచి యుద్ధనౌకపై న్యూయార్క్‌కు పంపబడింది. పంపడానికి ముందుగానే విగ్రహంలో వివిధ భాగాలు అన్నీ పూర్తిగా అమర్చబడ్డాయి. భాగాలను అమర్చడానికి పారిస్‌లో ఎఫిల్‌టవర్‌ను రూపొందించిన అలెగ్జాండ్రె జి ఎఫిల్ ఒక ఉక్కు చట్రాన్ని నిర్మించాడు. 1886 లో విగ్రహం నూయార్క్‌కు అంకితం చేయబడింది.

తీగలు అమర్చిన గాజు జ్యోతి 14,000 వాట్స్ విద్యుత్తుతో వెలుగుతుంది. ఈ విగ్రహం, విగ్రహం ఉన్న లిబర్టీ ద్వీపం రాత్రిపూట కాంతివంతంగా కొన్ని మైళ్ల దూరానికి కూడా బాగా కనిపిస్తాయి.

●

## వ్యర్థప్రసంగం ఎప్పుడూ దురలవాటు



వ్యర్థప్రసంగం ఎప్పుడూ - ద్వేషం, వగ, మనో దౌర్బల్యం మొదలైన దుర్గుణాలను తెలియజేస్తుంది యువకులు వ్యర్థప్రసంగానికి పూనుకోకూడదు ఈ దుర్గుణాలకు లొంగిపోకుండా ఎవరికివారు నన్నరించుకోవాలి. పనిలేని ప్రసంగం దురలవాటు

జె జి.హాలండ్

"ఉపకారాన్ని మించిన సద్గుణం లేదు.
హింసను మించిన దుర్గుణం లేదు."

—శ్రీరామ

# కొండమేక

సోనా అవస్థి

హిమాలయన్ టార్ (Tahr) అనే కొండ మేకలు మిక్కిలి ప్రమాదకరమైన హిమాలయ ప్రదేశపు మైదానాలలో నివసిస్తాయి ఒక కొండ మీద నుంచి మరో కొండమీదికి దూకుతూ సులభంగా పట్టుబడని ఈ మేక అడవిజాతికి చెందినది.



టార్ కాశ్మీరు నుండి సిక్కిం మరియు భూటాన్ వరకు హిమాలయా పర్వత ప్రదేశాలలో నివసిస్తుంది. ఈ హిమాలయా టార్ మేకకి గొర్రె మరియు మేక రెంటి శారీరక లక్షణాలు ఉంటాయి. మేకకు ఉన్నట్టు మగటార్‌కి పొడుగాటి కొమ్ములుగానీ, గడ్డంగానీ ఉండదు. కానీ తోక మేకతోకలాగే పొట్టిగా ఉంటుంది. బాగా పెరిగిన మగటార్ భుజాల దగ్గర 90 మొదలు 100 సెం.మీ.లు పొడవుగా ఉంటుంది. సుమారు 110 కి.గ్రా.లు భారం తూగుతుంది. మగటార్‌లు ఆడవాటికంటే రూపంలో పెద్దవి. మెడమీద, భుజంమీద రేగిపోయి చిక్కుబడిన బొచ్చు కాళ్లదాకా పెరిగి ఉంటుంది.

ఆడ మగ టార్‌లలో వర్ణవైవిధ్యం కూడా కనిపిస్తుంది. సాధారణంగా మగవి ముదురు ఎరుపు ఇటుకవర్ణంలోను, ఆడవి కొంచెం లేత ఇటుకరంగులోను, చిన్నవి పాలిపోయిన రంగులోను ఉంటాయి. మగవాటికి కొమ్ములు పొట్టిగా, క్రింద వెడల్పుగా దగ్గర దగ్గరగా ఉంటాయి. కొమ్ములు చివరలు తప్ప అంతా ముడతలుతేరి వెనుకకు వంగి ఉంటాయి.

సామాన్యంగా టార్‌లు ఎత్తైన కొండలమీద, ఏటవాలు ప్రదేశాలలో నివసిస్తాయి. సముద్ర మట్టానికి 2500 మరియు 4000 మీటర్లపైగా ఎత్తున దట్టమైన అడవులలో సంచరిస్తాయి ఇక్కడ వీటికి ఇతర పెంపుడు జంతువుల పోటీఉండదు. వేటగాళ్లకు కూడా చాలా దుర్ఘట మైన ఇటువంటి ప్రదేశాలు వీటికి రక్షణను ఇస్తాయి. నిపుణులైన వేటగాళ్లకు కూడా సుల

## విజ్ఞానవాక్కు

* మానవుడు గొప్పపండితుడు ఎలా అవుతాడు?
  శ్రవణంవల్ల మానవుడు పండితుడు అవుతాడు
* మానవునికి ఉత్తమ సహచరుడు ఎవరు?
  ధైర్యం మానవునికి ఉత్తమోత్తమమైన సహచరుడు.
* అన్నిటికంటే గొప్ప సౌభాగ్యమేది?
  విద్య అన్నిటికంటే గొప్ప సౌభాగ్యం.
* అధికంగా కోరుకునే భాగ్యం ఏది?
  ఆరోగ్య భాగ్యం అధికంగా కోరుకునే సౌభాగ్యం
* ఏది లేకపోతే మనిషి గౌరవించబడతాడు?
  అహంకారం లేని మనిషిని అందరూ గౌరవిస్తారు.
* కుదర్చడానికి కష్టమైన వ్యాధి ఏది?
  'అత్యాశ'అనే వ్యాధిని కుదర్చడం మహాకష్టం.

-మహాభారతం

"మనస్సు, ఇంద్రియాలు అడవిగుర్రాలులాగే రథం లాంటిది బుద్ధిమంతుడు పగ్గములతో నియంత్రిస్తాడు."

—ఉపనిషత్తు

భంగా చిక్కకుండా ఎక్కువ శ్రమను కలిగిస్తాయి. కొండలపైన స్నోలెవర్స్ క్రింద ప్రదేశాలలో అడవికుక్కలు మాత్రమే వీటికి శత్రువులు.

టార్ పచ్చగడ్డి, మూలికలు, ఆకులు, చిగుళ్ళు తింటాయి. ముఖ్యంగా ఆడవి మేతకు బయట తిరుగుతాయి. బాగా పెరిగిన మగవి తరచు బయటకురావు. ఇవి పగలంతా ఓకు, రింగాల్ మరియు పేము అడవులలో సంచరిస్తాయి. సంధ్యచీకటిపడటంతోటే బయటకు వస్తాయి.

మగటార్‌లు 6 మొదలు 12 చేరి గుంపులు గుంపులుగా తిరుగుతాయి సామాన్యంగా ఇవి శీతాకాలంలో జతకూడడానికి ఆడవాటిని చేరతాయి. ఇతర జంతువులలోలాగే మగవి ఆడదానికోసం పోరాడుకుంటాయి. వీటి పోరాటం సాధారణంగా ఉండదు. చాలా భయంకరంగా ఉంటుంది. మరణానికే ఈ పోరాటం ఏటవాలు ప్రదేశాలలో పోరాడుతూ కాలికి సరైనపట్టులేక పోరాడేవాటిలో ఒకటి తరచు క్రిందికి జారిపడి పోతుంది.

ఆడ టార్ మేక ఒకే పిల్లను ఈనుతుంది. సాధారణంగా6 నెలలు చూలుకట్టిన తరువాత వేసవికాలం చివర చిన్నపిల్ల పుడుతుంది. పిల్ల పుట్టడంతోటే మగవి తల్లిని, పిల్లని వదలి వెళ్లిపోతాయి. తిరిగి జతకూడే సమయంలో కనిపిస్తాయి పిల్లమేకల సౌఖ్యంకోసం ఇవి తరచుగా వేరేమైదానాలకు వెడుతుంటాయని కొందరు అంటారు.

చిన్నమేకలకు 6 నెలలదాకా తల్లిమేకలు పాలిస్తాయి. 1 1/2 సంవత్సరాలకు ఇవి బాగా పెరిగి పెద్దవి అవుతాయి. టార్ సగటు జీవితం 10 మొదలు 14 సంవత్సరాలు.

—'సి.ఇ.ఇ-ఎన్.ఎఫ్.ఎస్' సౌజన్యంతో

●

## చతురంగ చతురుడు

ఇండియన్ క్రికెట్ టీమ్‌లో మణీందర్‌సింగ్ చతురంగ చతురుడు.

## కడుపులో వ్రణాల నిరోధానికి అరటికాయలు సహకరిస్తాయి



ఇంగ్లండ్ ఆస్టన్ యూనివర్శిటీలో ఫార్మాస్యూటికల్ సైన్సెస్ డిపార్ట్‌మెంట్‌లో పరిశోధనలు చేస్తూన్న వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు పచ్చి అరటికాయ కడుపులో వ్రణాలను మాన్పగలదని తెలుసుకున్నారు. మన దేశంలో కడుపులో వ్రణాలు తగ్గడానికి, ఇతర అజీర్ణ వ్యాధులకు మామూలుగా అరటికాయలు వాడతారు. అభివృద్ధి పొందుతూన్న దేశాలలో చాలామంది కాయకూరగా వండుకు తింటారు అరటి అన్నకోశం లోపలిపొరలో మ్యూకోసా (Mucosa) కణాల అభివృద్ధిని ఉత్తేజపరుస్తుంది. కడుపులో ఆమ్లాలకు ఒకరక్షక అవరోధం ఏర్పడుతుంది. ముందుగా ఏర్పడిన వ్రణాలను శీఘ్రంగా మాన్పి స్వస్థపరుస్తుంది.

—'ఇన్‌వెన్షన్ ఇంటెలిజెన్స్' సౌజన్యంతో

"ఒక వస్తువుయొక్క గిరాకీనిబట్టి దాని విలువ తెలుస్తుంది."

# సూపర్ కండక్టివిటీ

విద్యున్నిరోధకం శూన్యానికి దిగిపోయి నప్పుడు సూపర్ కండక్టర్లు విద్యుదుత్పాదనలో కలిగే నష్టాలను, మరియు ప్రసార నష్టాలను అత్యద్భుతంగా తగ్గించేస్తాయి. అయస్కాంత క్షేత్రాలు (magnetic fields) సాంప్రదాయక విద్యుదయస్కాంతములచే ఉత్పత్తి కాబడే వాటికంటే ఏడు మొదలు ఎనిమిది రెట్లు



ప్రబలంగా పెరిగే అవకాశం ఉంటుంది ప్రస్తుతం సూపర్ కండక్టివిటీ అత్యంత తక్కువ ఉష్ణోగ్రతల దగ్గర మాత్రమే సాధించ బడుతూంది.

ఈ ప్రతిబంధకంతో కూడా సూపర్‌కండక్టర్స్‌చే ఉత్పాదింపబడే బలిష్ఠమైన అయస్కాంత క్షేత్రాలు అప్పుడే వ్యావహారికంగా ఉపయోగించుకునే దశలో ఉన్నాయి. ఉదాహరణకి వైద్య రంగంలో ఉపయోగింప బడుతున్న మాగ్నెటిక్ రెసోనెన్స్ ఇమేజింగ్ (MRI) మరియు భూతలం మీద బ్రహ్మాండమైన వేగంతో పోయే లీనియర్-మోటార్ కారు అభివృద్ధి పొందింపబడుతున్నాయి.

లీనియర్-మోటార్ ట్రాన్స్‌పోర్ట్ బలిష్ఠమైన విద్యుదయస్కాంతాల ఆధారంతో రైలుపట్టాల మీద తేలిపోతుంది. ముఖ్యంగా భూకంపాలు అధికంగా ఉండే జపాన్‌లో ఈ కార్లు మార్గం మీద 11 సెం.మీ.ల పైగా తేలుతూ భూకంపం వల్ల కంపించే మార్గం మీద ప్రయాణ సమయంలో కలిగే నష్టం లేకుండా ప్రయాణం చేస్తాయి

జపాన్‌లో అత్యంత శక్తివంతమైన విద్యుదయస్కాంత క్షేత్రాల అవసరం ఉంది కాబట్టి ఈ విధానంలో వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు విద్యుదయస్కాంతాలను సూపర్‌కండక్టు చేయడానికి పూనుకున్నారు. చాలాకాలం క్రిందటే 1979 లోనే మానవ ప్రమేయం లేకుండా నడిచిన టెస్ట్‌కార్లు ఇటువంటి సూపర్‌కండక్టింగ్ అయస్కాంతాల ఉపయోగంతో గంటకు 500 కి.మీ.ల వేగం సాధించాయి

సూపర్‌కండక్టివిటీకి మరో ఉపయోగం కూడా ఉంది సూపర్ కండక్టింగ్ విద్యుదయస్కాంతాల సహాయంతో సముద్రంలో ఓడలను నడపడానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. మాగ్నెటోహైడ్రోడైనమిక్ (MHD) శక్తి ఉత్పాదన పరిశోధనా దశలో ఉంది.

సూపర్‌కండక్టివిటీని సామాన్య ఉపయోగానికి వినియోగించడానికి ముఖ్యంగా తీగ అడ్డుకోత చదరపు సెంటీమీటరుకు 10,000 ఆంపియర్లు విద్యుత్‌ప్రవాహాన్ని ప్రసరింప జేసేదిగా ఉండాలి జపాను తయారీదారులు 1988 లో లాబొరేటరీలో ఈ అవధిని అధిగమించారు.

'పసిఫిక్ ఫ్రెండ్' సౌజన్యంతో

"మనస్సులో చురుకుదనం, పనిలో తగినశ్రద్ధ, జీవితంలో రెండు ముఖ్యమైన విషయాలు."

# యువతరానికి

జీవితం పరిపూర్ణవంతం చేసుకుని శూన్యావస్థలో దిగి పడిపోకుండా సార్థకంగా జీవించడం ఎలా అనే ప్రశ్న తరచు మీకు కలుగుతూంటుందని నాకు తెలుసు. మీరు జీవిస్తున్న దోషభూయిష్టమైన సమాజాన్ని చిత్త శుద్ధితో, విశ్వాస పూర్వకంగా, సర్వసౌభ్రాతృత్వంతో,



న్యాయాన్ని, ధర్మాన్ని పాలిస్తూ, సంస్కరించు కుంటూ, సంఘీభావాన్ని పెంపొందించడం ఎలా అని కుతూహల పడుతూంటారు.

ఎన్ని అడ్డంకులైనా, ఎంతకష్టమైనా గొప్ప గొప్ప ఆదర్శాలతో అంతరాత్మకు హాని కలి గించుకోకుండా ఉండాలని అనుకుంటారు అని తెలుసు. దీని కోసం మీ జీవితం పట్ల, సమాజం పట్ల ఉత్సాహపూరితమైన ధన భావంతో జీవించడానికి కుతూహల పడుతు న్నారని కూడా నాకు తెలుసు.

ప్రపంచాన్ని సరిదిద్దడానికి మీ హృదయంలో బ్రహ్మాండమైన శక్తిని చైతన్యవంతం చేసుకోండి. అప్పుడు ఎన్ని ఆటంకాలు కలిగినా ఏరోజు కారోజు ప్రేమానుభూతితో ఉత్తమ విశ్వాస ఫలితాలను అనుభవించడానికి ప్రయత్నిస్తారు. ఎన్నడూ పాఠశాలలో ఉదాసీనంగా ప్రవర్తించవద్దు నిరంతర అధ్యయనంతో, శ్రద్ధగా వింటూ అవసరమైనప్పుడు ఇతరుల సేవకు పూను కుంటూ ఉండాలి.

ఓ యువకులారా! మిమ్ములను నమ్ము కున్నాను ప్రపంచ ప్రగతికి మీరే ఆధారం. సామాజాభివృద్ధికి మీరే ఆధారం. ఇక కొద్ది రోజులలో నా ఆశయాలు పూర్తిగా నెరవేర్చ గలరనే దృఢనమ్మకం నాకు ఉంది.

'పోప్‌జాన్ పాల్ II (ఇన్‌స్పిరేషనల్ కోట్)'
సౌజన్యంతో

## 52 సంవత్సరాల క్రితం బెర్లిన్‌లో అణువిభజన చేయబడింది

*52 సంవత్సరాలకు పూర్వం 1938లో 'ఆటో హాన్' అనే జర్మన్ అణువిజ్ఞాన శాస్త్రవేత్త మరియు ఫ్రిట్జ్‌స్ట్రాస్‌మన్ అనే భౌతిక విజ్ఞానవేత్త సహకారంతో మొట్టమొదట అణువిస్ఫోటనం ప్రయోగాత్మకంగా విజయవంతంచేసాడు. వీరు న్యూట్రాను లతో యురేనియంను ప్రేల్చి యురేనియంలో నగం భారవంతమైన ఒక క్రొత్త మూలపదార్థాన్ని సృష్టించారు ఈనాడు ప్రపంచం అంతా 100 కి పైబడి అణుశక్తి కేంద్రాలు ఇదేపద్ధతిని ఉపయోగించి విద్యుచ్ఛక్తిని జనింపజేస్తున్నాయి. ఇదేపద్ధతిని అణుబాంబులలోను, అణు ఆయుధాలలోను ఉపయోగిస్తున్నారు.*

—'జర్మన్ ఫీచర్స్' సౌజన్యంతో

"కావలసినవన్నీ స్వాధీనం చేసుకో. కానీ వాటికి లొంగిపోకు."
—స్వామీ చిన్మయానంద

# విజ్ఞాన దీపిక

## మొట్టమొదటి బాంకులు

సుమారు 4000 సంవత్సరాలకు పూర్వం బాబిలోన్‌లో దేవాలయాలే మొట్టమొదటి బాంకులు. వ్యవసాయదారులకు పంటకోత కాలంలో వడ్డీతో సహా తిరిగి వాపసు చేయాలనే



షరతు మీద ఋణాలను మంజూరు చేసేవారు. ఆ తరువాత ఈజిప్టు మరియు గ్రీకు దేవాలయాలు కూడా అవసరమైన వారికి డబ్బు బదులు ఇస్తూండేవి. బిసి 6 వ శతాబ్దంలో బాబిలోన్‌లో ల్గిబి (Lgibi) కుటుంబం అధునాతన విధానంలో స్వంత బాంకు నిర్వహణ ప్రారంభించి సొమ్ము డిపాజిట్లులను స్వీకరించి వాటిమీద వడ్డీని ఇస్తూండేది. డిపాజిట్టు చేసి ఉంచిన వస్తువుల మీదగాని, పంట తాకట్టు మీద గానీ అప్పులు జారీ చేస్తూండేవారు.

* * *

## బార్బ్‌డ్ వైరు కనిపెట్టిన చతురుడు

స్థలాలకు చుట్టూ కంచె వేసుకోడానికి ఉపయోగించే బార్బ్‌డ్ వైర్‌ను యుఎస్‌ఎకి చెందిన జోసెఫ్ ఫార్‌వెల్ గ్లిడ్డెన్ 1873 లో కనిపెట్టాడు. లోహపు రేకును సన్నని ముక్కలుగా చీల్చి రెండు తీగలు చుట్టూ మెలిపెట్టేవాడు.

* * *

## మొట్టమొదటి వాచీలు జర్మనీలో తయారు చేయబడ్డాయి

మొట్టమొదటి వాచీలు 15 వ శతాబ్దం చివరిభాగంలో జర్మనీలో తయారు చేయబడ్డాయి. ఇవి గోళాకారంలో ఉండటం వల్ల వాటిని 'నూరెంబర్గ్ ఎగ్స్' అనేవారు. ఇవి చాలా పెద్దవిగా ఉండేవి. కాలం సరిగ్గా చూపేవి కావు, కాబట్టి వాటిని జేబులలో పెట్టుకునేవారు కారు. 17 వ శతాబ్దం చివరి భాగంలో థామస్ టాంపియన్ అనే ఆంగ్లేయుడు మొదటి డెడ్ బీట్ ఎస్కేప్‌మెంట్ (వాచిలో కదలిక నియంత్రణకు నవ కల్పన)తో సరిగ్గా తిరిగే గడియారాలు తయారుచేసాడు.

* * *

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన శిల్పాలు

*అమెరికా అధ్యక్షులు జార్జివాషింగ్‌టన్, అబ్రహాం లింకన్, థామస్‌జెఫర్‌సన్, థియోడోర్ రూస్‌వెల్ట్ శిల్పాలు ప్రపంచంలో బ్రహ్మాండమైన శిల్పాలు. ఇవి దక్షిణ డకోటాలో బ్లాక్ పర్వతశ్రేణిలో రష్‌మోర్ కొండల ప్రక్కగా చెక్కబడ్డాయి. ఈ పెద్ద పెద్ద శిల్పాలు 60 మైళ్ల దూరంనుంచీ కూడా బాగా కనిపిస్తాయి. తలపైనుంచి గడ్డం చివరిదాకా వీటి ముఖాలు 60 అడుగులు ఉంటాయి. వీటిని గుట్జాన్ బోర్‌గ్లమ్ అనే సుప్రసిద్ధ శిల్పి 1927 నుంచి 1941 లో అతడు చనిపోయేదాకా చెక్కాడు.*

"నీతిగా ఒక్కపైసా ఆర్జించడానికి, ఏపనీకూడా నీచంకాదు."

## మహా సముద్రాలనుండి విద్యుచ్ఛక్తి

యూరప్‌లో 11 వ శతాబ్దంలో సముద్రంలో రటాల నుంచి ఉత్పత్తి కాబడే శకితో పని సే చిన్న చిన్న మిల్లులు నిర్మింపబడ్డాయి. తరువాత 1881లో ఫ్రెంచి వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు ర్సన్‌వాల్ సముద్రంనుంచి విద్యుచ్ఛక్తిని ంపజేయడానికి ఒక విస్తృతమైన ప్రణాళి ు తయారుచేసాడు. 1930లో జార్జి క్లాడ్ నే అమెరికా వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు సముద్రం ంచి విద్యుచ్ఛక్తి జనింపజేయడానికి ప్లాంట్‌ను ప్పరచి విజయం పొందాడు. ఆ తరువాత 72లో ఏర్పడిన నూనె కరవు వల్ల యునైటెడ్ ట్స్ ప్రభుత్వం క్లాడ్ ప్లాంట్ ఆధారంగా ్పృతంగా కార్యక్రమాలు ప్రారంభించారు.

* * *

## వాల్‌పేపర్స్

పశ్చిమదేశాలలో ఇంకా తెలియక ముందే నాలో వాల్‌పేపరు వాడుకలో ఉండేది. 16వ శాబ్దకాలంలో ఇది యూరప్‌లో ప్రవేశింప ి ఉండాలి. మొట్టమొదట ఇవి చాలా ంరటుగా ఉండేది. చిన్నచిన్న ముక్కలతో తుకులుగా పెడుతూండేవారు పరదాలు, వ్యచిత్రాలు, కొయ్యచట్రాలు వలెగాక చాలా ందవికారంగా ఉండేవి.

18వ శతాబ్దంలో వాల్‌పేపర్ ఇంగ్లండులో ్య సామాన్యం అయిపోయింది. చాలాచౌక ట్టి అందరూ వాడటం ప్రారంభించారు ంరీలు, పురాతన శిల్పాలు, పెద్దపెద్ద ంనాలు, పూలచెట్లు,పూలు మొదలైన వాటి త్రాలు, మార్బుల్ అనుకరణలు, తోలు ండాలుతో రకరకాల డిజైనులు వాడేవారు. ి చాలా కాలం వరకు అందరూ చైనావాల్ ంర్లను అభిమానించేవారు

●

## మనుష్యులు నాలుగురకాలు

తెలియనివాడు, తనకు తెలియదని తెలియనివాడు
శుద్ధ అవివేకి - వర్జించు
తెలియనివాడు, తనకు తెలియదని తెలిసినవాడు
నిష్కపటి - నేర్పించు
తెలిసినవాడు, తనకు తెలుసునని తెలియనివాడు
నిద్రలో ఉంటాడు - లేపించు
తెలిసినవాడు, తనకు తెలుసునని తెలిసినవాడు
వివేకవంతుడు - అనుసరించు.

—అరబిక్ సామెత

## నివారింపగల వ్యాధులతో సాలీనా 14.5 మిలియను పిల్లలు మరణిస్తున్నారు



అభివృద్ధి పొందుతూన్న దేశాలలో సాలీనా 14 5 మిలియనుమంది పిల్లలు నివారింపగల వ్యాధులతో మరణిస్తున్నారు. 12 మిలియనుమంది పసిపిల్లలు ఏడాది దాటకుండా మరణిస్తున్నారు 5 సంవత్సరాలలోపుగా 1 5 మిలియనుమంది పిల్లలు మరణిస్తున్నారు 130 మిలియను మంది పిల్లలు స్కూళ్లకు వెళ్ళరు - చదువుసంధ్యలులేవు

-'యునైటెడ్‌నేషన్స్ స్పెషలైజ్డ్ కమిటీస్' సౌజన్యంతో

"భావనాశుద్ధి ప్రభావంవల్ల ఆచరణశుద్ధి అప్రయత్నంగా ఏర్పడుతుంది."

# హాల్ ఆఫ్ ఫేమ్

లండన్(ఇంగ్లండ్) నగరంలో మేడమ్ టుస్సాడ్ హాల్ ఆఫ్ ఫేమ్ సుమారు 170 సంవత్సరాలకు పూర్వం స్థాపించబడింది. ఈ హాల్‌లో చరిత్రలో వివిధ దేశాలకు, కాలాలకు చెందిన సుప్రసిద్ధ పురుషుల మరియు స్త్రీల చిత్రాలను అనేకం చూడవచ్చు మహారాజుల మరియు మహారాణీల చిత్రాలు. అధ్యక్షులు,



BENJAMIN FRANKLIN

రచయితలు, పండితులు, రాజకీయ దురంధరులు మరియు క్రీడాకారులు, నటీనటులు, సేనానాయకులు, కామెడియనుల చిత్రాలు జీవకళ ఉట్టిపడుతూ మనతో మాట్లాడుతున్నాయా అని అనిపిస్తుంది.

మేరీ టుస్సాడ్ 1850 లో మరణించింది. కానీ బ్రిటిషువారు జీవకళతో ఉన్న ఆమె మైనపు విగ్రహాన్ని నేటికీ ఎంతో అభిమానిస్తారు. ఆమె ప్రారంభించిన వాక్స్ వర్క్స్ మ్యూజియం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. ప్రతీ సంవత్సరం మిలియనుల కొద్దీ చూడడానికి వచ్చే వారంతా హాల్ ఆఫ్ ఫేమ్‌ను చూచి ముగ్ధులైపోతారు.

హాల్ ఆఫ్ ఫేమ్‌లో మైనపు విగ్రహాలను చేయడానికి ఏర్పాటైన వేలకొద్దీ మోల్డులలో 50 చాలా ముఖ్యమైనవి, ప్రత్యేకమైనవి. ఇవి మేడమ్ టుస్సాడ్ తాను స్వంతంగా తయారుచేసి సర్ వాల్టర్ స్కాట్, విలియంపిట్, వోల్టైర్ బెంజమిన్ ఫ్రాంక్లిన్ మొదలైన సుప్రసిద్ధుల వాక్స్‌శిల్పాలు. కొన్ని కొన్ని సమయాలలో వ్యక్తుల మరణించిన తరువాత మోల్డ్ చేయబడ్డాయి వీటిని డెత్ మాస్క్స్ అంటారు. వీటిలో లూయి XVI, క్వీన్ మేరీ ఆంటోయినెట్టె ఫ్రెంచి విప్లవానికి గురైన ఇతర వీరుల మొదలైన వారి మోల్డులు అనేకం ఉన్నాయి.

దీనిలోపలికి ప్రవేశించేటప్పుడు ద్వారం దగ్గర ఆశ్చర్యపడిపోతారు గట్టిగా మాట్లాడరు. ఒక అందగత్తె గైడు పుస్తకాన్ని చూపిస్తూంటుంది ఒకటి కొందామని ప్రయత్నిస్తారు. కా

## ప్రపంచంలో మొత్తం 15 మిలియను కాందిశీకులు

*ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా 15 మిలియన కాందిశీకులు (refugees) ఉన్నట్టు అంచనావేయ బడింది. మూడవ ప్రపంచపు దేశాలలో 12 మిలియన మంది కాందిశీకులు ఉన్నారు వీరిలో పాకిస్థాన్‌లో 35 మిలియను, ఇరాన్‌లో 26 మిలియనుకుపైన సూడాన్‌లో 800,000 మంది, థాయ్‌లాండ్‌లో 400,000 మంది, మధ్య అమెరికా మరియు మెక్సికోలో 300,000 మంది కాందిశీకులు ఉన్నారు మిడిల్‌ఈస్ట్‌లో 2 మిలియన్ పేలస్టైన్ కాందిశీకుల నివసిస్తున్నారు.*

—'జర్మన్ ఫీచర్స్' సౌజన్యం

"హాస్యాన్ని ఆస్వాదించలేని మనిషి బ్రతుకు దుర్భరం."

ేంటనే మోసపోతారు. అది వాక్స్‌తో తయారైన బొమ్మ కాబట్టి. ఇంతలో మరోబొమ్మను సూస్తారు. కుర్చీలో కునికిపాట్లు పడుతూన్న ఒక ఆమె చేతిలో ఉన్న గైడ్ పుస్తకం జారి క్రింద్పడుతుంది. దానిని తీసి ఆమెచేతిలో పెడతారు. 170 సంవత్సరాలనుంచీ అందరూ అలాగే చేస్తున్నారు.



VOLTAIRE

పాలరాతి మెట్లు ఎక్కి ప్రదర్శన గదులలోకి ప్రవేశించాలి. ఇక్కడే టుస్సాడ్ అయిదు రాల కళారచనలు భద్రపరచబడ్డాయి. ల కొట్టే దుక్కపై తలవంచిన స్కాట్లండ్ శపు మేరీ మహారాణి ప్రక్క నిలుచున్న లారి, విక్టరీ ఓడపై మరణావస్థలో ఉన్న ల్సన్ విగ్రహాలు ఇక్కడ ఉన్నాయి. కొన్ని లానుగుణ్యంగా వరుసగా అమర్చబడ్డాయి. వ. హెన్రీ తన ఆరుమంది భార్యలను పదృష్టితో వీక్షిస్తూన్న దృశ్యం ఒకటి మిక్కిలి ద్భుతమైనది.

ఈ బ్రహ్మాండమైన భవనంలో సుందరాతి ందరమైనది గ్రాండ్ హాల్. ఇక్కడ రాజ ంశాన్ని విన్‌స్టన్ చర్చిల్‌ని, కాబినెట్ సభ్యులతో ధాన మంత్రిని చూడవచ్చు. ఇక్కడే విక్టోరియా మహారాణి, అధ్యక్షుడు ఐసెన్ హెూవర్, నెపోలియన్, సుప్రసిద్ధ క్రికెట్ యోధుడు పీటర్ మే మొదలైన వారిని కూడా చూడవచ్చు.

ఇంగ్లండు దేశపు సుప్రసిద్ధ ప్రదర్శకురాలు అని చెప్పబడే మేడమ్ మేరీ టుస్సాడ్ స్విస్ దేశానికి చెందిన గ్రోస్‌హెూల్ట్జ్ కుమార్తె. ఈమె ఆరవ సంవత్సరం వయస్సులో పారిస్(ఫ్రాన్స్) చేరి మేనమామ డా.ఫిలిప్పీ కుర్టియస్ దగ్గర ఉండేది. ఇతడు హాబీగా తన స్నేహితుల వాక్స్ మోడల్స్‌ను తయారు చేస్తూండేవాడు. వాటిని ప్రజలకు ప్రదర్శిస్తూండేవాడు.

ఫిలిప్పీ తన మేనకోడలైన మేరీకి వాక్స్ మోడల్స్ తయారుచేయడం నేర్పించాడు.

## సుభాషితాలు

మాటల మాటలు వచ్చును
మాటలనే కలుగుచుండు మణిమంత్రంబుల్
మాటల పొందిక తెలిసిన
మాటలనే ముక్తి కలుగు మహిలోవేమా!

*[మానవుడు ఆడేమాటలే నిందను కలిగిస్తాయి,మంత్రసిద్ధినీ కలిగిస్తాయి. పొందికగా మాట్లాడం నేర్చుకుంటే, ఆమాటలవల్ల ముక్తి కూడా లభిస్తుంది. ]*

* * *

దిక్కులేనివారి దీనతబాపిన
పురుమ డిహమునందె పూజ్యుడగును
వరమునందు వాని భాగ్యమేమనవచ్చు?
విశ్వదాభిరామ వినురవేమా!

*[ దిక్కులేని వారిని రక్షించినవారికి ఈలోకంలోనే గౌరవం లభిస్తుంది. ఇక వరలోకంలో సంగతి వేరే చెప్పాలా? ]*

"హాస్యం కత్తిమీద సాము. తగ్గితే నవ్వురాదు,
హెచ్చితే అపహాస్యం అవుతుంది."

ఈమె మిక్కిలి శ్రద్ధాభక్తులతో నేర్చుకుని ఈ కళలో మామను మించి ఘనురాలు అనిపించు కుంది. 22 వ సంవత్సరం వయస్సులో అఖండ కీర్తిని సంపాదించి ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. ఫ్రాన్స్‌కు మొదటి అమెరికా రాజదూత బెంజమిన్ ఫ్రాంక్లిన్ స్టూడియోకి వచ్చి మేరీ వద్ద మోడల్‌గా నిలుచున్నారు.



Churchill

1789లో ఫ్రెంచి విప్లవం ప్రారంభమైనప్పుడు ఈమె మరియు ఈమెతో పాటు ఇతర ఫ్రెంచి వారు నిర్బంధించబడ్డారు. ఉరితీయుటకు సిద్ధంగా ఉన్నప్పుడు అధికారులు విప్లవంలో మరణించిన వారి వాక్స్‌మోడల్స్ తయారు చేయమని ఆమెను అడిగారు. ఉరి తీయబడే 'రెయిన్ ఆఫ్ టెర్రర్' కాలం పూర్తి అయిన పిమ్మట ఆమె వదలి పెట్టబడింది. ఇంతలో మేనమామ ఫిలిప్స్ మరణించాడు. నిరాశ్ర యురాలైన మేరీ మోడలింగ్ స్టూడియో స్థాపించింది. 34 వ సంవత్సరం వయస్సులో ఈమె ఫ్రాంకోయిస్ టుస్సాడ్ అనే ఫ్రెంచి ఇంజినీరును వివాహం చేసుకుంది.

కొన్ని సంవత్సరాల తరువాత ఈమె కొన్ని విగ్రహాలను ఆమెతోపాటు లండన్ నగరానికి తీసుకు వెళ్ళింది. భర్తకు పారిస్ మ్యూజియంను అప్పగించింది. ఇది విజయవంతంగా కొనసాగ లేదు ఆ తరువాత భర్త సంగతి తెలియలేదు. లైసియమ్ థియేటర్‌లో ఈమె లండన్ ప్రదర్శన గొప్ప విజయంగా పరిణమించింది. తరువాత 32 సంవత్సరాలు ఆమె చేసిన వాక్స్ బొమ్మలు వాగనులలో బ్రిటిష్ దీవులంతా ప్రదర్శింప బడ్డాయి.

74 వ సంవత్సరం వయస్సులో ఈమె లండన్‌లో స్థిరపడింది. అక్కడ బేకర్ స్ట్రీట్ అనే వీధిలో ఒక పెద్దహాల్ అద్దెకు తీసుకుంది. వాక్స్ మోడల్స్‌తో బేకర్ స్ట్రీట్‌కి ప్రసిద్ధి కలిగింది కానన్ డోయల్ తన డిటెక్టివ్ షెర్లాక్ హోమ్స్ కి ఈ వీధిని నివాసంగా ఎన్నుకున్నాడు. 1884 లో మ్యూజియం ఇప్పుడున్న మార్లైల్ బోన్ రోడ్డుకు మార్చబడింది. 81 వ సంవత్సరం వయస్సులో ఈమె దీనిని తన కుమారులకు అప్పజెప్పింది.

ఇప్పటికీ ఇక్కడ వాక్స్‌మోడల్స్ తయారీ అతి విస్తృతంగా జరుగుతూంది. ఈమె సంతతికి చెందిన మనుమలు, మునిమనుమలు మహనీయుల బొమ్మలను ఎన్నో సేకరించారు.

●

## ఆదిశంకరాచార్యులు

పాశ్చాత్యుల ఊహకు అందని అద్భుతవ్యక్తి శ్రీ శంకరాచార్యులు. ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిస్సి భక్తికి ఆశ్చర్యపడతాం ఏబిలార్డ్ పాండిత్యానికి అబ్బుర పడతాం మార్టిన్ లూథర్ స్వాతంత్ర్యాభిమానానికి సంతోషపడతాం. ఇగ్నేషియస్ లయోలా రాజకీయ శక్తిసామర్థ్యాలను కొనియాడతాం ఇవన్నీ ఏకమై ఉన్న ఒకే వ్యక్తిని ఎవరు ఊహించగలరు?

—సిస్టర్ నివేదిత

"నలుగురూ తలుచుకుని తలుచుకుని నవ్వగలిగితే అది ఆరోగ్యకరమైన హాస్యం."

# సహృదయతకు ఆరుసూచనలు

1. ఇతరుల పట్ల మనఃపూర్వకంగా అసలైన ఆసక్తిని, అభిరుచిని పెంపొందించుకోవాలి. వారి ఆశయాలు, అభిరుచులు,జీవితం గురించి వారితో మాట్లాడు.

2. చిరునవ్వు అభ్యాసం చేసుకో. తన మంద హాసం తనకు కోటి మేలు చేస్తుందని చార్లీ ష్వాబ్ అంటాడు. 'నవ్వు ముఖం లేని మనిషి ఏషాపూ ప్రారంభించకూడదు




అన్ని శక్తి సామర్థ్యాలు వినియోగం కంటే చిరునవ్వు ఎందరినో ఆహ్వానిస్తుంది' అనే చైనా సామెత ఒకటి ఉంది.

3. జ్ఞాపకం పెట్టుకుని వ్యక్తిపేరు ఉపయోగి స్తూండు. ఏ భాషలోనైనా సరే వ్యక్తికి తనపేరు ఎంతో ముఖ్యం. పేరు వింటే ఆనందం.

4. శ్రద్ధగా విను. ఎదుటి మనిషి తను గొప్పవా డనుకోడానికి అతడు చెప్పేది చెవులారా వినాలి. అమ్మేవారు బాగా వింటేనే గానీ తన సరకుల వివిధ లక్షణాలలో వేటిని విపుల పరచి చెప్పాలో తెలుసుకోలేరు.

5 ఎప్పుడూ ఎదుటి వారి అభిప్రాయాన్ని అభిరుచిని బట్టి మాట్లాడుతూండు. ఒకరి హృదయాన్ని ఆకర్షించాలంటే వారికి అత్యంత ప్రీతికరమైన విషయాలను గురించి ప్రసంగించాలి.

6 ఎదుటివారు ఎంతో ముఖ్యులు అనే అభిప్రాయం వారిని తెలుసుకోనివ్వు. నీ ప్రశంసను, మెప్పును ప్రదర్శించు. విమర్శకు ఎన్నడూ పూనుకోవద్దు.

## జై తెలుగు తల్లీ!
## జై తెలుగు తల్లీ!

*మా తెలుగు తల్లికి మల్లెపూదండ*
*మా కన్నతల్లికి మంగళారతులు*
*కడుపులో బంగారు, కనుచూపులో కరుణ*
*చిరునవ్వులో సిరులు దొరిలించుతూ తల్లి*
*గలగలా గోదారి కదలిపోతూంటేను*
*బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను*
*బంగారు పంటలే పండుతాయి*
*మురిపాల ముత్యాలు దొరులుతాయి*
*అమరావతీ గుహల అపురూప శిల్పాలు*
*త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు*
*తిక్కన్న కలములో తియ్యందనాలు*
*నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక*
*రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి*
*తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయల కీర్తి*
*మా చెవుల రింగని మారుమ్రోగేదాక*
*నీ పాటలే పాడుతాం, నీ ఆటలే ఆడుతాం*
*జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!!*

—శ్రీ శే.శ్రీశంకరంబాడి సుందరాచారి

"చిత్త సమున్నత్వం కలసిన హస్తకౌశలంతో చేసినపని సుందరాతి సుందరం"

# సరసోక్తులు

## ప్రబంధం వ్రాస్తాడు

చమత్కారంగా చాటువుల మీద మాట్లాడ లేని వ్యక్తి పేరాలు పేరాలుగా వ్రాస్తాడు.



పేరాలలో విశదంగా వ్రాయలేనివాడు వాదించడం అభివృద్ధి చేసుకుంటాడు. సరిగ్గా వాదించ లేనివాడు ప్రబంధం వ్రాస్తాడు

—లిన్ యుటాంగ్

* * *

## ద్రవ్యోల్బణం

ద్రవ్యోల్బణం అనేది రోడ్లమీద ట్రాఫిక్ జామ్‌లో ఇరుక్కోడం వంటిది. సందిగ్ధంగా ఉండే సమస్యలో నీవు చిక్కుకోకపోయినా ఏంచేయాలో నీకు తెలియదు.

—చికాగో టైమ్స్

* * *

## సమస్య వివేకానికి పోటీ

ఒక సమస్య వాస్తవంగా వివేకానికి పోటీ అని చెప్పుకోవాలి. పరిష్కారం అయేవరకూ సమస్యలు అన్నీ సమస్యలే. పరిష్కారం సాధించిన వారికి ఫలితం దక్కుతుంది. సమస్యలను తప్పించుకోడం కంటే వాటిని అభిమానిస్తూ వివేకంతో పరిష్కారం చేసు కుంటూ ప్రతిఫలాన్ని దక్కించుకోవాలి.

—హెన్రీఫోర్డు

* * *

## స్వీయచరిత్ర

ఏవిధమైన పోటీ లేకుండా ఇతరుల గురించి నిజం చెప్పడానికి సాధనం స్వీయ చరిత్ర.

* * *

## రహస్యం

నీ అంతట నీవు నీలో దాచుకోలేవు కాబట్టి ఇంకొకరికి చెప్పవద్దని చెప్పేది రహస్యం.

* * *

## నిగ్రహం

నిగ్రహం అమూల్యమైన ఆస్థి. పోగొట్టుకోవద్దు.

* * *

## వయస్సుకు తగిన ఉద్దీపన

ఏవయస్సుకు ఆ ఉద్దీపన కలుగుతూంటుంది. అంతేకాని మనిషి ఎప్పుడూ మనిషిగానే

"మనవలన ఏ ప్రయోజనం ఆశింపనివారు, మనకు బాధకలిగినప్పుడు తోడ్పడదలచినవారు సజ్జనులు."

ఉంటాడు. పదేళ్ల వయస్సులో మిఠాయిలకు పొంగిపోతాడు. ఇరవైఏళ్లకి-సతీమణితో ఉద్దీపన కలిగించుకుంటాడు 30 ఏళ్లకి సుఖసంతోషాలతో ఉద్దీపన కలిగించు కుంటాడు. 40వ సం.రం. వయస్సులో పెద్ద పెద్ద ఆశయాలతో ఉద్దీపన కలుగుతుంది. 50వ ఏట అత్యాశా లోభం. ఆ తరువాత వివేకాన్ని పట్టుకుంటాడు.

—రూసో

* * *

## నిర్వహణ యోచన

అందరితోటీ మంచిగా ప్రవర్తించే నిర్వాహకుడు అసలు గొప్ప నిర్వాహకుడు కాలేడు.

—వై.ఎమ్.ఎన్.మూర్తి

* * *

## వ్యవహారవేత్తలు తెలిసిందంతా చెప్పరు

అసలైన వ్యవహారవేత్తలు తెలిసినదంతా చెప్పరు. వార్తావాహకులు తెలిసిన దానికంటే అధికంగా చెబుతారు.

* * *

## విజయవంతమైన గ్రంథం

ఒక గ్రంథం చదవకుండా అంతా చదివినట్టు నటిస్తే అది విజయవంతమైన గ్రంథం.

* * *

## ఇంకా పట్టు పడలేదు!

గాలివాన తీవ్రంగా ఉంది! ఇళ్ళు కూలి పోయాయి ఒక పురుషోత్తముడు ఒకవ్యక్తిని 'మీ ఇల్లు కూడా కూలిపోయిందా?' అని అడిగాడు సరిగ్గా చెప్పలేను. ఇంకా కనిపించలేదు!

* * *

## వాక్చాతుర్యంగల ఉపన్యాసకుడు

అతి తక్కువగా సరసమైన మాటలతో ప్రసంగించేవాడు వాక్చాతుర్యం గల ఉపన్యాసకుడు అర్థంలేని మాటలు ఎక్కువగా మాట్లాడేవాడు వదరుబోతు.

●

## నందాదేవి నేషనల్ పార్క్



*ఉత్తరప్రదేశ్ గార్వాల్ హిమాలయ పర్వత ప్రదేశంలో 63,000 హెక్టేరుల నందాదేవినేషనల్‌పార్క్ ప్రపంచ వారసత్వ ప్రదేశంగా (World Heritage site) గుర్తించబడింది. ఈపార్కు సహజ సౌందర్యానికి చాలాప్రసిద్ధి పొందింది. స్నోలెపర్డ్, మస్క్‌డీర్, టార్, బ్లూ గొర్రె మొదలైన అంతరించిపోయే భయంకర పరిస్థితులలో ఉన్న జంతువులు ఇక్కడ ఉన్నాయి. ఇది హిమాలయ పర్వత ప్రదేశంలో ఉంది కాబట్టి మానవ సంపర్కం అంతగాలేక చెక్కు చెదరకుండా ఉంది. ఇక్కడ కొండల మధ్య ప్రవహించే ఋషిగంగా ఎంతో అందంగా ఉంటుంది.*

—సిఇఇ.ఎన్.ఎఫ్ ఎస్ సౌజన్యంతో

"మాట్లాడకుండా ఉండటం మౌనం కాదు.
మాట్లాడవలసిన అవశ్యకతను తగ్గించడమే మౌనం."

# కీటక ప్రపంచంలో సంగీత సామరస్యం

కీటకాలన్నిటిలో సికాడా (Cicada) మిక్కిలి ఎక్కువగా శబ్దంతో సంగీతం పాడుతుంది. దీని సాయంకాలపు పాట ఉచ్ఛస్థాయిలో లయబద్ధంగా పాడే మొర్రోకాస్ (morrocas) లాగ ఉంటుంది. సికాడా క్రింది కడుపుకు



రెండుప్రక్కల బాగా గాలితో ఉబ్బిన తబలాల వంటి అంగాలు రెండు ఉంటాయి. ఈ రెండింటిని బలిష్టమైన కండరాలతో కదుపుతూ ఉంటుంది. ఈ తబలాలు క్రమపద్ధతిలో కంపిస్తూంటాయి. కంపిస్తూండగా తబలాలు సికాడా పూర్తి శరీరంతో చేరినప్పుడు ధ్వని బాగా పెరిగి విస్తరింపబడుతుంది. కీటక ప్రపంచంలో సికాడా పాడే సంగీతం అతి నిర్దుష్టంగా ఉంటుంది.

గొల్లభామలకు ప్రతీ వెనుక కాలి వెనుక వళ్ళతో దువ్వెనలవంటి స్క్రేపర్స్ ఉంటాయి. వీటిలో రెక్కలలో ఉండే నరాలను నిలువుగా రాస్తూంటుంది. క్రికెట్ అనే కీచురాయికి మరియు కాటీడిడ్స్ (katydids) కి బాగా సంగీతం పుట్టించడానికి అనువైన అంగనిర్మాణం ఉంది. క్రికెట్లకు ముందురెక్కలలో సికాడా డ్రమ్‌హెడ్స్‌లాంటి ప్రత్యేకమైన ప్రతిధ్వనిని కలిగించే ప్రదేశాలు ఉన్నాయి. క్రికెట్లు, కాటీడిడ్స్ చేసే సంగీతం గొల్లభామ చేసే సంగీతం కంటె తీవ్రంగా ఉంటుంది. వీటిక రెక్కలు నిలువుగా లేస్తాయి. డ్రమ్‌హెడ్‌లు విస్తరించు కుంటాయి అప్పుడు రెక్కంతా పూర్తిగా ప్రతిధ్వని సాధనిగా ఉంటుంది.

ఆడక్రికెట్లు ప్రలోభించే మగవాటి శబ్దాన్ని ఉత్కంఠతో ఆలకిస్తాయి. సామాన్యంగా రెండు మగక్రికెట్లు ఆట ప్రారంభిస్తాయి. ఒకదాని తరువాత ఒకటి శబ్దం చేస్తూ పాడతాయి ఈవిధంగా ఇతర మగవాటిని ఆకర్షిస్తాయి అన్నీచేరి ఒక పెద్ద కచ్చేరి చేస్తాయి. ఆడ వాటిని ఆకర్షిస్తాయి.

—'సైన్స్ డైజెస్ట్' సౌజన్యంతో

## భారతదేశంలో ఇళ్ళసంఖ్య 124.9 మిలియను

*1985లో ది నేషనల్ బిల్డింగ్ ఆర్గనైజేషన్ వారు భారతదేశంలో నిర్మించబడిన ఇళ్ళు 124.9 మిలియను అని అంచనావేశారు. పట్టణాలలో ప్రతీ కుటుంబానికి ఒక పక్కా లేక కొంతవరకూ సౌకర్యమైన ఇల్లు, గ్రామాలలో ప్రతీ కుటుంబానికి సౌకర్యవంతమైన పక్కా ఇల్లులేక కొంతవరకూ సౌకర్యవంతమైన ఇల్లు చొప్పున మొత్తం దేశంలో 25.6 మిలియను ఇళ్ళకి ఇంకా కొరత ఏర్పడుతుంది. AD 2000 నాటికి గ్రామీణ ప్రాంతాలలో లోటు లేకుండా ఉండాలంటే 57 మిలియను ఇళ్లు కట్టవలసి వస్తుంది. ఒక్కొక్క ఇంటికి అధమం రూ 10,000 చొప్పున మొత్తం సుమారు రూ.57,000 కోట్లు పెట్టుబడి కావలసి ఉంటుంది.*

—'యోజన' సౌజన్యంతో

"దానము, సత్యము, ప్రియముగా పలుకుట,
హింసాబుద్ధి లేకుండుట అభ్యసించవలసిన సద్గుణాలు."

# బిజాపూర్ - ఆదిల్‌షాహి వంశానికి ముఖ్య కేంద్రం

రాఘవేంద్రరావు

బీడువారిపోయిన దక్కన్ పీఠభూమి ప్రదేశంలో బిజాపూర్ (విజయనగరం) బెంగళూరుకి సుమారు 666 కి.మీ.ల దూరంలో ఉంది. నేడు చారిత్రక శిథిలాలతో ఉన్న ఈ చిన్న ఊరు ఒకప్పుడు 200 సంవత్సరాల దీర్ఘకాలం పాలించిన ఆదిల్‌షాహి వంశానికి ముఖ్యపట్టణం.



GOL GUMBAZ

AD 1074 లో రాష్ట్రకూటుల నుంచి కళ్యాణపురానికి చెందిన పశ్చిమ చాళుక్యులు వశంకాక ముందు బిజాపూర్ బిజ్జనహళ్లి అనే చిన్న గ్రామంగా ఉండేది అని రికార్డుల వల్ల తెలుస్తూంది. వారు దీనికి 'విజయపుర' లేక విజయనగరం అని పేరు పెట్టారు. ఆ తరువాత ఇది దేవగిరి (దౌలతాబాద్) యాదవులకు సంక్రమించింది. 1312లో ఢిల్లీ సుల్తాన్ అలాఉద్దీన్ ఖిల్జీచే జయించబడిన విజయపురం గుల్బర్గాను పాలించే బహ్మనీ రాజుల ఆధీనంలోకి వచ్చింది

బిజాపూర్ గవర్నరుగా ఉన్న యూసఫ్ ఆదిల్‌షా 1489లో తిరుగుబాటు చేసి తిరిగి దానికి బిజాపూర్ అని పేరుపెట్టి ఆదిల్‌షాహి వంశాన్ని స్థాపించాడు. అనటోలియోకు చెందిన అమురాత్ II కుమారుడు యూసఫ్ ఖాన్ బాలుడుగా ఉన్నప్పుడు భారతదేశానికి తీసుకురాబడ్డాడు ఇతడు పెరిగి పెద్దవాడై బహ్మనీ సుల్తానుల దగ్గర చేరాడు. మూడు దశాబ్దాల కాలంలో గవర్నరు పదవిని చేపట్టాడు బహ్మనీ సామ్రాజ్యం పతనం ప్రారంభమైనప్పుడు అవకాశాన్ని వినియోగించుకుని స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు.

ఆదిల్‌షాహి వంశస్థులు నిర్మాణ కార్యక్రమాన్ని ఉత్సాహపరచి బిజాపూర్‌లో 50 మసీదులు, 20 సమాధులు, అనేక రాజభవనాలు నిర్మించారు. ఈ కట్టడాలన్నీ దక్కను శిల్ప చాతుర్యంతో అతిసున్నితమైన సౌందర్యంతో అలరారుతుంటాయి.

మొట్టమొదటి సుప్రసిద్ధ నిర్మాణం జమీ మస్జిద్. ఇది దక్కన్‌లో బ్రహ్మాండమైనది. 1558-80 సంవత్సరాల మధ్య అలి అదిల్ షా I పరిపాలనా కాలంలో నిర్మించబడింది. అయితే ఇది అసంపూర్ణంగా ఉంది. పైన రెండు గోపురాలు

## మేరియాథెరీసా బొమ్మతో వెండినాణాలు ఇంకా చలామణిలో ఉన్నాయి

ఆస్ట్రియన్ మహారాణి మేరియాథెరీసా బొమ్మ, ఆమె మరణించిన సంవత్సరం ముద్రించిన వెండి నాణాలు ఇంకా ఆఫ్రికా ఎర్రసముద్రతీరంమీద నివసించే ఆదివాసులు ఉపయోగించుకుంటున్నారు. వారు వీటిని ఎంతో అభిమానిస్తారు. ఆస్ట్రియా మహారాణి AD 1780లో మరణించింది.

"పిడికెడు విత్తనాలు మడికెల్ల జాలు,
ఒక్కడే కొడుకైన వంశాన జాలు."

—జానపదగేయం

లేవు. ఆ తరువాత మొగల్ చక్రవర్తి ఔరంగజేబు దీనికి సింహద్వారం కట్టించాడు. నగరానికి చుట్టూగల పెద్ద ప్రహరీలకు దగ్గర ఇబ్రహీం ఆదిల్‌షా II (1580-1627) మరియు అతడి కుటుంబానికి సంబంధించిన సమాధులు ఉన్నాయి. ఇది భారతదేశంలో అపూర్వ హస్తకళా నైపుణ్యంతో తులతూగుతూండే అందమైన స్మారక భవనం.



బ్రహ్మాండమైన మూడు పెద్ద పెద్ద ఆర్చిలతో గగన్‌మహల్, నగరంలో మిక్కిలి గంభీరంగా కనిపించే ఏడు అంతస్థుల సత్ మంజిలి విలాస భవనం, మహమ్మద్ ప్రవక్తకు సంబంధించిన పురాశిల్ప వస్తువులు భద్రపరచిన అసార్-ఇ-షరీఫ్, అందమైన నగిషీలతో చెక్కబడిన ద్వారంగల మిహ్‌తారీ మస్జీద్ ముఖ్యంగా చూడవలసినవి

మహమ్మద్ ఆదిల్ షా (1627-57) సమాధిపై గోల్‌గుంబజ్ (వర్తులాకారపు డోము) ప్రపంచంలో మిక్కిలి పెద్దది. ఇటలీ రోమ్‌లో పాంథియన్ రెండవ పెద్ద డోము. డోము మొత్తం లోతలం వైశాల్యం 1,672 చదరపు మీటర్లు. సమాధి లోవైపు విస్పరింగ్ గాలరీ ఉంది ఇక్కడ దీనిక్రింద ఎంత మెల్లిగా రహస్యంగా మాట్లాడుకున్నా బిగ్గరగా ప్రతిధ్వనిస్తుంది.

200 సంవత్సరాల దీర్ఘపాలనలో బిజాపూర్‌ను ఎనిమిది మంది అదిల్‌షాహి రాజులు పాలించారు. అతిసున్నితమైన తివాసీలు, కాంతితో దేదీప్యమానంగా ప్రకాశించే హస్తలిఖిత ప్రతులు తయారుచేయబడ్డాయి. సుప్రసిద్ధ 'హిస్టరీ ఆఫ్ ది దక్కన్' రచించిన మహమ్మదీయుల చరిత్రకారుడు ఫిరిష్టా (Firishta) ఇబ్రహీం II ఆస్థానంలో ఉంటూండేవాడు.

1686 అక్టోబర్‌లో మొగల్‌చక్రవర్తి ఔరంగజేబు బిజాపూర్‌పై దండెత్తాడు పెద్ద రక్తపాతం ఏర్పడింది. ఆదిల్‌షాహి వంశంలో చిట్టచివరి వారసుడు 20 సంవత్సరాల బాలుడు సికిందర్ ఆదిల్‌షాని వెండి గొలుసులతో కట్టి ఔరంగజేబు ముందు పెట్టారు! బిజాపూర్ మొగల్ సామ్రాజ్యంలో చేరిపోయింది.

## నీవు ఇంకా ఆమెను మోసుకువస్తున్నావు

*ఒక ఊరిలో ఇద్దరు సన్యాసులు ఒక గ్రామం నుంచి మరోగ్రామానికి వెడుతున్నారు మధ్య ఏరు పారుతూంది ఏటిగట్టున ఒక యువతి వలవలా ఏడుస్తూంది సన్యాసులు ఆమె ఏడుపుకు కారణం అడిగి తెలుసుకున్నారు. ఏరు అవతల ఉన్న ఇంటికి వెళ్లడానికి ఏటినీటిలో ఈదడం చేతగాక ఆమె ఏడుస్తూంది. ఒక సన్యాసి ఆమెను అమాంతం భుజాల మీదికి ఎత్తుకుని ఈదుకుంటూ ఏరుదాటి భద్రంగా ఆమెను దింపాడు తరువాత సన్యాసులు ఇద్దరూ తమ యాత్రను సాగిస్తున్నారు. రెండుగంటలు గడిచాక రెండోసన్యాసి 'నీవు మహాపాపంచేశావు ఆడదాన్ని ముట్టుకున్నావు' అన్నాడు అందుకు మొదటి సన్యాసి 'నేను ఆమెను రెండుగంటల క్రితమే దింపేశాను. నీవు ఇంకా ఆమెను మోసుకువస్తున్నావు' అన్నాడు.*

"పరులచే నవ్వుచేసి పప్పుకూడు దినుటకంటే
దొరకు సంబలి యొక్క దోసెడే మేలు."
—జానపదగేయం

# రెసూస్ కోతి

పవన్‌కుమార్ షా

సాధారణంగా ఉత్తర మరియు మధ్య భారతదేశంలో కనిపించే రెసూస్ కోతి ఏప్ మరియు మానవునికి చెందిన ప్రైమేట్స్ ఆదిమజాతిలో చేరినది రెసూస్‌కోతులు మాకాక్యు వర్గీకరణ (macaque-classification)లోనివి. విలక్షణమైన ఎర్రని ముఖము, నారింజ



ఎరువు రంగు వెనుక భాగములు వంటి లక్షణాలను బట్టి రెసూస్‌లను సులభంగా గుర్తింవవచ్చు.

బలిష్టముగా ఉండి క్రింద కూర్చునే మగ రెసూస్45 మొదలు 60 సెంటీ మీటర్ల ఎత్తుగా ఉంటుంది. ఆడది కొంచెం చిన్నదిగా ఉంటుంది. తోక సుమారు 30 సెంటీమీటర్లు ఉంటుంది. నొసటి మీద కనుబొమల నుండి వెంట్రుకలు వెనుకకు పెరిగి ఉంటాయి.

రెసూస్ మాకాక్యూలు ప్రధానంగా దట్టమైన అడవి ప్రదేశాలలో 30 దాకా చేరి గుంపులు

## క్విజ్-జవాబులు:

1. (ఎ)భూసారాన్ని పోషించి నిర్వహించడానికి ఒక పంట తరువాత మరోపంటను క్రమంగా పండించుట 2 (డి)జయదేవుడు, 3. (సి) విలియంజోన్స్, 4. (బి) మాంస కృత్తులు (ప్రొటీనులు), 5. (ఎ) కోరింత దగ్గు, 6 (ఎ) అన్ని మతాలకు సమానమైన అంగీకారము, 7. (డి) కోజికోడ్ (Kozhikode), 8 (సి)సెక్రటరీ, మినిస్ట్రీ ఆఫ్ ఫైనాన్స్.

## తెలివికి పరీక్ష-జవాబులు:

1. పాత, 2. రెండూ సమానంగా ఒక్క టన్నే తూగుతాయి, 3. నిద్రకు చేటు, 4. కబీరుదాను, రామదాను, 5. దగ్గమైపోతాయి, 6. బరువు భాద్యతలు వదలుకోవాలి, 7. అర్ధం, 8. అసత్యం.

## మాటల మహిమ-జవాబులు:

1. జరీ(ఎ), జలతారు (బి); 2. శవము(ఎ), అసమర్థుడు(బి), అల్పుడు(సి); 3. మాయ మాట(ఎ), మారువేషము(బి), మాయ(సి), అబద్ధము(డి); 4 ధైర్యము(ఎ), శక్తి(బి), సత్తువ(సి); 5 వాసన(ఎ), ఆకలి(బి), శైశవ దశయందున్న (సి), పచ్చని(డి); 6. గుట్టు (ఎ), మర్మము (బి), సీల(సి), ఉపాయము (డి); 7 అన్నము (ఎ), కలసి యుండు(బి), కలుగు(సి), రమించు(డి); 8. పాటపాడువాడు (ఎ), వర్తకుడు(బి), ప్రౌఢుడు (సి).

"ఒరులతో చాడిచెప్పి యుడగరలందు కంటే
గరిమెతో గోచైన కట్టేది మేలు."

—జానపదగేయం

గుంపులుగా పళ్లు, ధాన్యం, గింజలు, బెర్రీలు తింటూ సంచరిస్తాయి.

చెట్లమీద సంచరించే హనుమాన్ లాంగూర్‌వలెగాక మాకాక్యూలు భూప్రదేశం మీద సంచరిస్తాయి ఇవి ఆఫ్రికా బాబూన్‌లు వంటివి.

ఇవి పూర్తిగా శాకాహారులు కావు. చిన్న చిన్న పక్షులను, కీటకాలను కూడా తింటాయి. నోటి దౌడలలో ఉండే సంచులలో నిల్వచేసు కుంటూ మాకాక్యులు త్వరత్వరగా అత్యల్పకాలంలో అత్యధికంగా తింటాయి. తరువాత ఏకాంతంగా నిరపాయకరమైన ప్రదేశంలో కూర్చుని నమిలి తింటాయి.

గుంపులు గుంపులుగా నివసిస్తూండడం వల్ల మాకాక్యూలకు అత్యధిక సాంఘిక భద్రత, రక్షణ లభిస్తుంది అపాయములనుండి సంరక్షణ, వాసయోగ్యమైన నివాస స్థలము, ఆహారం మొదలైన సౌకర్యాలకు కష్టపడక్కర్లేదు జాతి ప్రవృద్ధికలుగుతుంది. గుంపులలో ప్రధానమైన వాటికి తోకదిట్టంగా, నిలువుగా ఉంటుంది.

రెసూస్ మాకాక్యూలకు పరస్పరం దువ్వు కోటం ముఖ్యమైన పని. దీనివల్ల పరస్పర స్నేహబాంధవ్యం వృద్ధిపొంది గుంపులలో సహకారభావం పెంపొందుతుంది. ఈ దువ్వుకోటం పేలనుకుక్కి ఈగలను చంపి తినడానికి కాదు.

రెసూస్ నిర్మాణం మానవుని నిర్మాణంతో సరిగా ఉంటుంది. రెసూస్ కోతుల తులనాత్మక పరిశీలనలో వాటికి కూడా మానవరక్తం కణాలలో ఉన్నట్లే Rh లేక రెసూస్ ఫాక్టర్ కనుగొనబడింది. దీనివల్ల మానవునికి బ్లడ్‌ట్రాన్స్‌ఫ్యూజన్ (శరీరంలో నెత్తురు ఎక్కించడం)లో ఒక క్రొత్త సాంకేతిక పరిజ్ఞానం ఏర్పడింది. అనేకమంది రోగులను బ్రతికించడానికి ఎంతో సహకరించింది.

1949 లో రెసూస్ కోతిని రాకెట్‌లో పంపారు అదే అంతరిక్షంలో మొట్టమొదటి భూచరము

—'సి.ఇ.ఇ-ఎన్.ఎఫ్.ఎస్' సౌజన్యంతో

## నవ్వు - అపూర్వశక్తి



*ఒకవ్యక్తి జీవితంలో ఎన్నెన్నో ఒడిదుడుకులు వస్తూంటాయి. మానవుడు ఆశానిరాశల వెలగాటంలో చిక్కుకుపోతూంటాడు. అదృష్టం వట్టినప్పుడు పొంగిపోతాడు. దురదృష్టం పీడిస్తూంటే క్రుంగి పోతాడు. అహంకారం అనే అజ్ఞానంలో పడిపోయి వర్తమానాన్ని నాశనం చేసుకుంటాడు. భవిష్యత్తుని కూడా భయభ్రాంతం చేసుకుంటాడు. ఇలాంటి సమయాలలో హితోపదేశాలు, హితభోధలు పని చేయవు. సన్మార్గంలో పెట్టి రక్షించి ఆరోగ్యాన్ని, ఆనందాన్ని ఇవ్వగలిగేది నవ్వు. నవ్వుకి మనస్సును వికసింపజేసేశక్తి ఉంది. నవ్వుతో మానసికమైన ఒత్తిడులు తగ్గుతాయి. నవ్వు మనుగడను సుఖప్రదం చేస్తుంది. నవ్వగలవ్యక్తి తానుహాయిగా జీవిస్తాడు. చుట్టూ ఉన్నవారి జీవితవనాలను నందన వనాలుగా మారుస్తాడు.*

"అంటరానితనం ఉండేకంటే
హిందూమతం నశించడమే మేలు."

# మేనేజర్లకు సలహాలు

★ నీవు సాధించదలచుకున్నది ఏదో కచ్చితంగా తెలుసుకో (మీ కంపెనీ పాలసీ ప్రకారం నీవు సాధించవలసినది).

★ నీ క్రింద పనిచేసే ఉద్యోగస్తులకి ముందుగా ఏ ఏ పనులు ముగించాలి, లక్ష్యాలు ఏమిటి, నిర్ణయింపబడిన వాటి ప్రమాణాలు ఏమిటి,



పురమాయించిన పని ఎంత కాలంలో పూర్తి కావాలి, గడువు ఎంత, చేసిన పనికి విలువ ఎలా నిర్ణయిస్తావు, వారికి దక్కే ప్రతిఫలం ఏమిటి అనే విషయాలను గురించి వారికి వివరంగా తెలియజెప్పు.

★ ఉద్యోగస్థుల పనితీరు, వారు చేసే విధానాలు రికార్డు చేసి ఉంచుకో. ఉదాహరణ పూర్వకంగా సలహాలు ఇవ్వడానికి అనుకూలవంతంగా ఉంటుంది.

★ శ్రద్ధగా విను. ఉద్యోగస్థులను గురించి జరిపిన వివిధ పరిశీలనలలో మానేజ్‌మెంట్ తమ గురించి లక్ష్యం చేయరు అనే భావం ఏర్పడినట్టు తెలుస్తూంది.

★ ఎప్పటికప్పుడు ఉద్యోగస్తులను అడిగి ఏ పని బాగా జరిగింది, ఏది బాగా జరుగలేదో తెలుసుకో.

★ నీవు వ్రాసుకుని విలువ కట్టిన ప్రకారం ప్రతీ ఉద్యోగస్తుని పరిశీలించు. నీ నిర్ణయాలు సరైనవో, కావో వారిని అడిగి తెలుసుకుంటూండు. భిన్నాభిప్రాయాలు తీవ్రంగా ఉంటే పనిలో అభివృద్ధి ఉండదు. ఆటంకాలు ఏర్పడుతూంటాయి.

★ ప్రతీ ఉద్యోగస్తుని పనిని క్రమంగా పరిశీలిస్తూండు. అతడి బాగోగుల గురించి నీకెంతో శ్రద్ధ ఉన్నట్టు తెలియబరచు.

★ నీ ఆక్షేపణలు నిర్మాణాత్మకంగా ఉండాలి. ఉదాహరణ పూర్వకంగా అభివృద్ధి పొందేటట్టు చెప్పు.

★ న్యాయంగా ప్రవర్తించు. అవసరమైనప్పుడు న్యాయసమ్మతంగా ఆక్షేపించడం మానకు.

★ ఎవరైనా ఉద్యోగికి వ్యక్తిగతమైన సమస్యల వల్ల పని సరిగ్గా జరగనప్పుడు అవసరమైతే నిపుణుల సలహా, సహాయం ఇప్పిస్తానని తెలియజెప్పు.

(మిగతా 75 వ పేజీలో)

**50 మిలియను మందికి టైఫాయిడ్ వ్యాధి సోకుతోంది**

"ఇరుగు పొరుగులకు ఉపకారం చేయనివాడి జన్మ వ్యర్థం."

# పాదాల నొప్పి

అబ్రహాంలింకన్ ఒకసారి 'నాకు పాదాలు నొప్పులు పెడుతూంటే నేను ఆలోచించ లేను' అని చెప్పాడు. అయినా కాళ్లనొప్పి సమస్యకు లింకన్ పరిహారం చూసుకున్నాడు. ఉపశమనం కలిగించుకోడానికి వైద్యుని పిలి పించాడు. ఈ విధంగా ఐజాయిక్ జఖారే



అమెరికా దేశపు మొట్టమొదటి కాళ్లనొప్పులను నివారించే వైద్యుడుగా ప్రసిద్ధిపొందాడు.

మానవుని ప్రతీపాదంలోను 26 చిన్న చిన్న ఎముకలు ఉంటాయి. ఇవన్నీ కీళ్లతో ఒక దానితో ఒకటి చేరి ఉంటాయి. లిగమెంట్స్ అనే నరాలతో బిగించబడి ఉంటాయి. ఇవి కండరాలు మరియు స్నాయువులు (Tendons) సహాయంతో నియంత్రించబడుతుంటాయి. సామాన్యంగా నీవు రోజుకి 71/2 మైళ్లు నడుస్తు న్నట్టు లెక్కకట్టబడింది. ఈ సమయంలో నీ పాదాలు మొత్తం 1000 టన్నుల భారం మోస్తాయి. రోజుస్తమానం నీ పాదాలకు నీవు ధరించే జోళ్లలో నిరంతరంగా రాపిడి సంభవిస్తుంది. మాలు, సాక్సులు సరైనవి కాకపోతే కాళ్లకు బాధకలుగుతుంది. కొద్ది చదరపు అంగుళాల వైశాల్యం మీద 100 మొదలు 250 పౌండ్ల శరీరభారం మోసేటప్పుడు నీ కాళ్లను దుర్వి నియోగం చేసుకుంటున్నావన్నమాటే.

పాదాలకు సంబంధించిన వ్యాధులు సుమారు 75 ఉన్నాయి. కార్న్స్, కాల్లుసెస్ వంటివి సర్వసాధారణం. వీటి తరువాత బునియన్స్

## 18 మొదలు 21 వయస్సు గల 3.6 కోట్ల వోటర్లకు వోటుహక్కు లభించింది

*మొత్తం భారతదేశంలో ఉన్న 50 కోట్ల వోటర్లలో 72 శాతం అంటే సుమారు 3.6 కోట్లమంది (అస్సాం మినహాయించి) 18 మొదలు 21 సంవత్సరాల మధ్య వయస్సుగలవారికి మొట్టమొదటిసారి 1989 లోక్‌సభ ఎన్నికలలో వోటింగ్‌హక్కు లభించింది. ఈ వర్గానికి చెందినవారు ఆంధ్రప్రదేశ్‌లో 29,39,075 మంది వోటర్లు, బీహారులో 35,48,713 మంది మరియు ఉత్తరప్రదేశ్‌లో 54,68,161 మంది ఉన్నారు.*

## ఉత్సాహశక్తి తగ్గడానికి ముఖ్యకారణం

*నిరంతరం ఉత్సాహవంతంగా ఉండాలంటే స్వాభిమానాన్ని వదలుకుని ఇతరులయందు, ఇతరుల విషయాలలోను అభిమానం, ఉత్సుకత పెంచుకోవాలి. ఎప్పుడూ మనను గురించి ఆలోచించుకుంటూ తీవ్రతయవడిపోతూ, భయంతో, తక్కువతనంతో ఋణభావాన్ని పెంపొందించుకోడం ఉత్సాహశక్తి తగ్గిపోవడానికి ఒక కారణం.*

*డా. నార్మన్ విన్‌సెంట్ పీలీ*

"శీలసంపదను పెంపొందించలేని విద్య
పరిమళంలేని పువ్వు నిరర్థకం, అనర్థకం."

హేమర్‌టోస్, అథెలెట్స్ ఫుట్ ముఖ్యమైనవి. సరైన జోడు లేక మా కొనుక్కునేటప్పుడు నిపుణులు సూచించిన క్రింది సలహాలను అనుసరించు.

1 ఎప్పుడూ పెద్ద పాదం ఇమడ్చుండి. (చాలా మందికి ఒకపాదం ఇంకొక దానికంటే కొంచెం పెద్దదిగా ఉంటుంది).



2. నీ పాదాల ఆకారానికి బాగాసప్పేది తీసుకో.
3 ఎప్పుడూ నీ పాదం కంటే అరఅంగుళం పెద్ద మూలను తీసుకో.
4. టో కాప్ (Toe Cap) బాగా ఎత్తుగా ఉందో లేదో గమనించు. లేకపోతే కాలి వ్రేళ్లు నొక్కుకుపోతాయి.
5. బాగా మెత్తగా వంగే చర్మపు మూలు ఉపయోగించు. కృత్రిమమైన వాటికంటే ఇవి ఎంతో ఉత్తమమైనవి. చర్మం బాగా వంగుతుంది. గాలి ప్రవేశిస్తుంది. లోపలి ఇన్‌సోల్ మృదువుగా ఉండాలి. కుట్లు బాగా ఉండాలి. బొప్పెలు, బొడిసెలు ఉంటే పాదాలమీద పుళ్లు ఏర్పడతాయి.
6 కొత్తమూలతో షాపులో బాగా నడవలేకపోతే ఇక వాటిని గురించి మరిచిపో.

## స్వర్గసామ్రాజ్యంలో మిక్కిలి సుఖవంతులు ఎవరు?

శిష్యులు ఒకసారి జీసస్‌ని స్వర్గసామ్రాజ్యంలో మిక్కిలి సుఖవంతులు ఎవరు అని ప్రశ్నించారు జీసస్ ఒక చిన్నబాలుని వారి ముందు నిలబెట్టి "మీరంతా ఈ బాలుడిలాగా మార్పుచెందితేగానీ స్వర్గసామ్రాజ్యంలో ప్రవేశించడానికి అర్హులుకారు అతివినయంగా బాలునివలె ఉండేవారే స్వర్గ సామ్రాజ్యంలో మిక్కిలి ఎక్కువ సుఖవంతులు" అన్నాడు.

# నమ్మలేని నిజాలు

## అంధుడికి దృష్టిని ఇచ్చిన పిడుగు!

యు ఎస్ ఎ మెయినేలోని ఫాల్‌మౌత్‌లో రోడ్డు మీద సంభవించిన ఒక ప్రమాదంలో దృష్టికోల్పో యిన ఎడ్విన్ రాబిన్‌సన్ అనే 62 సంవత్సరాల వృద్ధుడిమీద పిడుగుపడింది. ఆ పిడుగు తాకిడికి అతడికి తిరిగి మామూలు దృష్టివచ్చింది!

* * *

## జీవనోపాధికి తన స్వంతమార్గం

యు.ఎస్.ఎ సాక్రామెంటోలో రే వాలిన్ అనే వ్యక్తి జీవనోపాధికి తన స్వంతమార్గం ఒకటి అవలంబించాడు. నున్నగా గొరిగించుకున్న తలమీద రకరకాల ఎడ్వర్టైజ్‌మెంటులతో ఊరంతా తిరగడం ప్రారంభించాడు.

* * *

## అందరూ శనివారం మరణించారు

బ్రిటన్‌దేశానికి చెందిన విలియం III, ఆనీ మహారాణి, జార్జి I, జార్జి II, జార్జి III మరియు జార్జి IV అందరూ శనివారం రోజునే మరణించారు

"చెడు అనవద్దు, చెడు వినవద్దు, చెడు చూడవద్దు."

# విజ్ఞానవేదిక

## కంప్యూటర్లు

ఏకొద్ది మందో వెండిచంచా నోటిలో పెట్టుకొని ఆగర్భ శ్రీమంతులుగా జన్మిస్తే మనం అందరం కూడా ఒక రెడీమేడ్ కంప్యూ టర్‌తో పుట్టాము. జీవితాంతం దీనిని నిర్వహించుకుంటూ ఉంటాము. సులభమైన కూడిక, తీసివేత, గుణకారం, భాగహారం మొదలైనవన్నీ చేసుకో



డానికి మనచేతుల 10 వ్రేళ్లు సహకరిస్తాయి అందుకే వివిధ గణిత పద్ధతులన్నిటిలో దశాంశ విధానం సామాన్యంగా ఉపయోగించ బడుతూంది.

కొన్నివేల సంవత్సరాలకు పూర్వం అక్షరాలు ఏర్పడని రోజులలో భారతదేశం ప్రజలు అంకెలు వ్రాయడం నేర్చుకున్నారు. అప్పుడు దశాంశ విధానం ప్రపంచం అంతా ప్రాకి పోయింది. ఈనాడు అదే అందరూ వాడు తున్నారు. చేతి వ్రేళ్లతో లెక్కపెట్టడమే గాకుండా కాగితం, పెన్సిలు లేనప్పుడు లెక్కలు కట్టడానికి ఎబకస్ (abacus)నే సాధనంగా వాడారు ఆనాడు మానవుడు కనిపెట్టిన ఒక అపూర్వ సాధన ఇది. ఎబకస్ అనేది ఒక కొయ్యచట్రం. ఈ చట్రంలో సమానాంతరంగా ఇనుప తీగలు అమర్చబడి ఉంటాయి. ఈ తీగలకు కుడి ఎడమ ప్రక్కలు జరపడానికి వీలుగా పూసలు దూర్చబడి ఉంటాయి. ఈ పూసలను కుడి ప్రక్కకు, ఎడమప్రక్కకు జరుపు కుంటూ కూడికలు, తీసివేతలు, గుణకారాలు, భాగహారాలు సులభంగా చేస్తారు. అనేక శతా బ్దాలపాటు మిక్కిలి క్లిష్టమైన లెక్కలు చేయ డానికి ఈ కాల్క్యులేటరును ఉపయోగించు కున్నారు.

కాలం గడుస్తున్న కొద్దీ ప్రజలు సాంకేతిక విజ్ఞాన రంగంలో, ఖగోళశాస్త్రంలో, వ్యాపార రంగంలో విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకున్నారు

(72వ పేజీ తరువాయి)

★ ఉద్యోగస్తులు నెరవేరుస్తున్న కంపెనీ లక్ష్యాలు ఎంతవరకు ఎలా సిద్ధిస్తున్నాయి, డిపార్ట్ మెంట్‌కి ఏవిధంగా లాభం కలుగుతూంది అన్న విషయాలను వివరిస్తూండు.

★ ఏపనిలోనైనా సమస్యలు ఏర్పడితే అవి విషమించి పెద్దవి కాకుండా ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ తీరిపోవడానికి ప్రోగ్రెస్ రిపోర్టులు, మినీరివ్యూలు ఉపయోగించు.

★ నీవు నీపనిని ఎలా పూర్తిచేయగలిగావో విమర్శించుకో ఉద్యోగస్తులకు ఆటంకం కలిగించే నీకు తెలియని లోటుపాట్లు నీలో ఏవైనా ఉన్నాయేమో అడిగితెలుసుకో. పని బాగా జరగడానికి ఏవైనా మార్పులను, సలహాలను సూచించమని అడుగుతూండు.

—'హెల్త్' సౌజన్యంతో.

"మతమంటే ధర్మబద్ధమైన జీవిత విధానం."

ఎబకస్ కంటే శీఘ్రంగా ఉపయోగపడగల సాధనం అవసరమైంది. ఈ అవసరాన్ని బట్టి రకరకాల ఆడింగ్ మెషీనులు, కాల్క్యులేటర్లు తయారు చేయబడ్డాయి. ఇవన్నీ 17-18 శతాబ్దాలలో ఉపయోగంలోకి వచ్చాయి.

తరువాత విద్యుచ్ఛక్తితో పనిచేసే అభివృద్ధి పొందిన మెషీనులు 20వ శతాబ్దం ప్రారంభంలో వాడుకలోకి వచ్చాయి. అప్పుడు మార్క్ 1 అనేది విశిష్టవంతమైన ఎలక్ట్రిక్ కాల్క్యులేటర్ దీని బరువు 4 5 టన్నులు. ఇది పెద్దపెద్ద లెక్కలు 5-సెకండ్లలో పూర్తి చేసేది.

సుమారు 50 సంవత్సరాల క్రితం ఒక అమెరికా వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు డి. అటానాసొ ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌ను ఊహించాడు. అయినా బాగా పనిచేసే మొదటి కంప్యూటర్ ఎన్నియాక్‌ను తయారుచేయడానికి అనేక సంవత్సరాలు పట్టింది ఈ మెషీన్ ఒక సెకండులో 300 పెద్ద పెద్ద గుణకారాలను చేసేది.

ఆనాటినుంచి కంప్యూటర్ సాంకేతిక విజ్ఞానం బ్రహ్మాండంగా ఉరుకులు, పరుగులతో అభివృద్ధి పొందుతూంది కంప్యూటర్లు రాను రాను చాలా చిన్నవిగా తయారవుతున్నాయి. ఈనాడు కావలసిన విషయాలు అచ్చువేసి స్క్రీన్‌మీద ప్రదర్శించగల ఒక పర్సనల్ కంప్యూటర్ సాధారణ టివి సెట్టుకంటే పెద్దదిగా ఉండదు. ఇవి ఊహించలేని వేగంతో పని చేస్తాయి. ఇల్లాక్ - 4 (Illiak-4) ఇంకా ఇటువంటి అధునాతనమైన నమూనాలు అన్నీ ఒకే ఒక సెకండులో బిలియన్ల కొద్దీ అసాధ్యమైన గణిత వ్యవహారాలు పూర్తిచేస్తాయి. ఇప్పుడు రూపొందించబడుతూన్న నమోనా సెకండుకి ట్రిలియన్ ఆపరేషన్లు చేస్తుంది

—'మిషా' సౌజన్యంతో

## 80 లోనూ దానిపైన సాధించిన విజయాలు



PABLO PICASSO

*80 వ సం రం వయస్సులో జార్జిబర్న్స్ 'ది సన్‌షైన్ బాయిస్' అనే సినీమాలో నటించినందుకు అకాడమీ బహుమానం పొందాడు గొయిథే 81సం రం వయస్సులో ఫాస్ట్ (Faust) రచన ముగించాడు లియో టాల్‌స్టాయ్ 82లో నేను ఊరికే ఉండలేను అన్నాడు 82 వ సంవత్సరం వయస్సులో విన్‌స్టన్ చర్చిల్ 'ఎ హిస్టరీ ఆఫ్ ది ఇంగ్లీష్ స్పీకింగ్ పీపుల్' పుస్తకం రచించాడు సామర్‌సెట్ మామ్ 84 లో 'పాయింట్స్ ఆఫ్ వ్యూ' రచించాడు. 88వ సంవత్సరం వయస్సులో కొన్‌రాడ్ ఎడెనాయెర్ పశ్చిమ జర్మనీకి ఛాన్స్‌లర్‌గా ఉన్నాడు. 89 వ సంవత్సరం వయస్సులో డా ఆల్‌బర్ట్ స్క్వైట్జెర్ ఆఫ్రికాలో ఒక హాస్పిటల్‌ను నిర్వహించాడు. పాబ్లో పికాస్సో 90 వ సంవత్సరంలో అనేక చిత్రాలు చిత్రిస్తూండేవాడు 91 వ సంవత్సరం వయస్సులో ఈమెన్ డి వాలెరా ఈరీ(ఐర్‌లాండ్)కి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. జార్జి బెర్నార్డ్ షా 93 వ సంవత్సరం వయస్సులో సుప్రసిద్ధ 'ఫార్‌ఫెచ్డ్ ఫేబిల్స్' నాటకాన్ని ప్రచురించాడు 94 వ సం.రం వయస్సులో ఆంగ్లేయ తాత్వికుడు బెర్ట్రాండ్ రస్సెల్ ప్రపంచశాంతికి ప్రయత్నాలు కొనసాగించాడు.*

"సత్యం మహావృక్షంలాంటిది. ఆచరించిన కొద్దీ ఎక్కువ ఫలాలను ఇస్తుంది."

# నాగూర్ పుణ్యక్షేత్రం

వి.ఎస్.శ్రీనివాసన్

తమిళనాడు తంజావూరు జిల్లాలో నాగ పట్టణానికిసుమారు ఆరుకిలోమీటర్ల దూరంలో నాగూర్ పుణ్యక్షేత్రం ఉంది. ఇక్కడి మీరాన్ సాహేబు సమాధి ఒక సుప్రసిద్ధ మహమ్మదీయ పుణ్యస్థలం. వీరిని హజరత్ షా-ఉల్-హమీద్ అని కూడా అంటారు. మహమ్మదీయులే గాక అనేక మంది భక్తులు హిందువులు, క్రిస్టియ



నులు కూడా దీనిని సందర్శిస్తారు జాతి మత భేదం లేకుండా వేలకు వేలు అన్ని జాతులవారు ఇక్కడకు వచ్చి భక్తి శ్రద్ధలతో పూజలు చేసి అద్భుతంగా మీరాన్ మహిమ వల్ల తమతమ కోరికలను నెరవేర్చుకుంటారు.

మీరాన్ సాహేబ్ అనేక మంది ఫకీరుల సహవాసం చేసి, వివిధ ప్రదేశాలు తిరిగి చిట్ట చివరకు నాగూర్‌లో జీవితం గడిపారు. గొప్ప మహిమ గల వీరిని మహమ్మదీయులు, ఇతర మతముల వారు దర్శించి సుఖశాంతులు పొందుతూండేవారు వీరు అనేక మహిమలను ప్రదర్శించేవారు. అందుచేత వీరిపేరు దేశ మంతా ప్రసిద్ధి చెందింది. సముద్ర ప్రయాణీకులకు ఆపద సంభవించినప్పుడు మిక్కిలి విశ్వాసంతో ఈ ఫకీరుని వేడుకుని కానుకలను అర్పిస్తారు. వారికి తప్పక రక్షణ కలుగుతుంది.

పిల్లలు లేని స్త్రీలు, కుదరని దీర్ఘ వ్యాధితో బాదపడే రోగులు నాగూర్ యాత్ర చేస్తారు. మరణించిన తరువాత కూడా వీరి దివ్యాను గ్రహంవల్ల భక్తివిశ్వాసాలతో ప్రార్థించే వారి కోరికలు సిద్ధిస్తాయి. నాగూర్‌లో ప్రతీ సంవత్సరం 15 రోజుల పాటు జరిగే కాండూరి (Kandoon) ఉత్సవానికి లక్షలాది భక్తులు వస్తారు.

ఉత్సవం 10 వ రోజు చాలా ముఖ్యమైనది. ఒక పెద్ద పాత్రను చందనంతో నింపి నాగూర్ మరియు నాగపట్టణం వీధులలో ఊరేగిస్తారు ఆ తరువాత ఫకీరు సమాధికి ఈ చందనాన్ని పూస్తారు. సుమారు 330 సంవత్సరాలకు పూర్వం ఈ ఫకీరు తంజావూరు రాజుగారికి వ్యాధి కుదిర్చినందుకు వారిపై గల విశ్వాసంతో రాజావారు ప్రత్యేకంగా ఒక స్థలాన్ని ఏర్పాటు చేసి దర్గా నిర్మించారు. దీనికి అయిదు గోపురాలు ఉన్నాయి. వీటిలో ఒకటి 90 అడుగుల ఎత్తు ఉంటుంది. చాలా దూరం కనిపిస్తుంది. దర్గా లోపల భాగం అంతా చలువరాతితో నిర్మించ బడింది. దర్గాద్వారాలు వెండిరేకు తాపడం చేసి ఉంటాయి. దర్గా ఎల్లప్పుడూ పరి శుభ్రంగా ఉంచబడుతుంది.

నాగూర్ పుణ్యక్షేత్రం పావురాలకు నివాసం. లెక్కలేనన్ని పావురాలు కూడా దర్గాలో ప్రార్థి స్తున్నాయా అని అనిపిస్తుంది. ఈ దృశ్యం చూడడానికి ఎంతో మనోహరంగా ఉంటుంది ●

"భూమిలోతులకు వేరు చొచ్చుకునిపోని వృక్షం చిరకాలం పెరగదు."

# క్రికెట్ విశేషాలు

## 'హిట్ వికెట్'

భారతదేశపు బాట్స్‌మన్ అశోక్‌మన్‌కడ్ 1974లో ఎడ్జ్‌బాస్టన్‌లో ఆడుతూన్నప్పుడు టోపీ స్టంపుల దగ్గర పడి 'హిట్‌వికెట్' వల్ల ఔట్ అయ్యాడు. అలాగే 1977-78 లో ఆస్ట్రేలియా బ్రిస్‌బేన్‌లో దిలీప్ వెన్గ్‌సార్కర్ ఆడేటప్పుడు జరిగింది.

* * *



## డబ్ల్యు.జి.గ్రేస్ 57 సంవత్సరాలలో 99,840 పరుగులు చేసాడు

సుప్రసిద్ధ ఇంగ్లీష్ క్రికెట్ యోధుడు డబ్ల్యు.జి.గ్రేస్ 57 సంవత్సరాలలో 99,840 పరుగులు చేసాడు. లక్ష పరుగులకు 160 తక్కువ

* * *

## డెనిస్ కాంప్టన్ బంతిని స్టంపుల వద్దకు కాలితో కొట్టాడు

1946 లో భారతదేశం మరియు ఇంగ్లండుల మధ్య జరిగిన ఓవల్ టెస్ట్‌లో డెనిస్ కాంప్టన్ బంతిని స్టంపుల దగ్గరకు కాలితో కొట్టి భారత జట్టు ఓపెనింగ్ బాట్స్‌మెన్ విజయ్ మర్చెంట్‌ను రన్ఔట్ చేసాడు

* * *

## అజ్హారుద్దీన్ మొదటి మూడు టెస్ట్ మాచ్‌లలో నూరేసి పరుగులు చేసాడు

మహమ్మద్ అజ్హారుద్దీన్ 1984-85లో కలకత్తా, మద్రాసు మరియు కాన్పూరులలో భారతజట్టుకి, ఇంగ్లండ్ జట్టుకి మధ్య జరిగిన మొదటి మూడు టెస్ట్ మాచ్‌లలో నూరేసి పరుగులు చేసాడు.

* * *

## మొదటి ఫస్ట్‌క్లాస్ మాచ్‌లో విశ్వనాథ్ 230 పరుగులు చేసాడు

మైసూరు మరియు ఆంధ్రా జట్ల మధ్య జరిగిన పోటీలో విశ్వనాథ్ తన మొదటి ఫస్ట్ క్లాస్ మాచ్‌లో 230 పరుగులు మరియు 1969-70 లో భారతదేశం మరియు ఆస్ట్రేలియా మధ్య జరిగిన తన మొదటి టెస్ట్ మాచ్‌లో 137 పరుగులు చేసాడు.

"విద్యకు వయస్సుతో నిమిత్తం లేదు."

# వైమానికరంగంలో

మొట్టమొదటి ఫ్లైట్: 1903 డిసెంబరు 17న ఉత్తర కరోలినాలో కిట్టీహాక్ దగ్గర ప్రప్రథమంగా ఫ్లైయర్ Iను ఆర్విల్ రైట్ (Orville Wright) గంటకు 48 కి.మీ.ల వేగంతో 12 సెకండ్లు నడిపాడు



FIRST PLANE
(WRIGHT BROTHERS)

ట్రాన్స్-అట్లాంటిక్ ఫ్లైట్: ఎక్కడా ఆగకుండా ట్రాన్స్-అట్లాంటిక్ ఫ్లైట్‌ను కాప్టెన్ జాన్ ఆల్కాక్ మరియు లెఫ్టినెంట్ ఆర్థర్ బ్రౌన్ అనే ఇద్దరు బ్రిటన్ దేశస్థులు 1919 జూన్ 14-15 న నిర్వహించారు

ట్రాన్స్ ఫసిఫిక్ ఫ్లైట్ మొట్టమొదటి ట్రాన్స్-ఫసిఫిక్ ఫ్లైట్‌ను మేజర్ క్లైడ్ పాంగ్ బార్న్ మరియు హ్యూగ్ హెర్న్‌డాన్ 1931 అక్టోబరు 3-5 న నిర్వహించారు.

సూపర్‌సోనిక్ ఫ్లైట్: యుఎస్ ఎయిర్ ఫోర్స్ కాప్టెన్ చుక్ ఈగెర్ 1947 అక్టోబరు 14న కాలిఫోర్నియాలో ఎడ్వర్డ్స్ ఎయిర్ ఫోర్స్ బేస్ మీదుగా మొట్టమొదటి సూపర్‌సోనిక్ ఫ్లైట్ చేసాడు

హెలికాప్టర్· మొట్టమొదట ప్రపంచంలో హెలికాప్టర్‌లో గంటకు 366 కి.మీ.ల వేగాన్ని మాస్కోలో 1978 సెప్టెంబరు 21న గొర్‌గుయెన్ కరపెట్యాన్ సాధించాడు.

ఎయిర్-స్పీడ్. స్పేస్ షటిల్ కొలంబియా మిక్కిలి వేగవంతమైన విమానం 108 టన్నుల భారవంతమైన ఈ షటిల్ 1981, ఏప్రిల్‌లో గంటకు 26,560 కి.మీ.ల వేగం అందుకుంది.

నాన్‌స్టాప్ ఫ్లైట్. 1986 డిసెంబరులో రిచర్డ్ రుటాన్ మరియు జీనా ఈగెర్ అనే ఇద్దరు అమెరికా దేశస్థులు నడిపిన వాయేజర్ మొట్టమొదట ఎక్కడా ఆగకుండా తిరిగి ఇంధనం నింపుకోకుండా 9 రోజులలో (డిసెంబరు 14-23) 41,000 కి.మీ.లు ప్రపంచం అంతా ప్రయాణం చేసింది

—'స్పాన్' సౌజన్యంతో

## బెంజమిన్ ఫ్రాంక్లిన్ వయస్సు అరవైఆరు

డెబ్బై సంవత్సరాలు దాటినా బెంజమిన్ ఫ్రాంక్లిన్ అంత వృద్ధుడుగా కనిపించేవాడు కాదు అందుకు ఆయన సమాధానమేమిటంటే 'డెబ్బై ఏళ్ళురాగానే నాకొక సంగతి తెలిసింది. ఇదే దారిలో ఇంకా ముందుకు పోతే ఆ దారి చివరే వృద్ధాప్యం, సమాధి ఉంటాయి అనిపించింది అందుకని డెబ్బైదగ్గరే కాస్త ఆగి నాలుగు సంవత్సరాలుగా వెనక్కి నడవడం ప్రారంభించాను కాబట్టి నా వయస్సు ఇప్పుడు అరవైఆరు.'

"సత్యం ఒకపెద్ద గని. లోతుకుపోయిన కొద్దీ మరింత విలువైన రత్నాలు లభిస్తాయి."

# పెన్సిల్‌తో 45,000 మాటలు

సాధారణంగా అందరూ వాడే పెన్సిల్ పొడవు 17.78 సెం.మీ.లు. ప్రపంచంలో అంతగా అందరూ అభిమానించకపోయినా తరుచు దొంగిలింపబడే వస్తువు ఇది. దీంట్లో అసలు సీసం (Lead) ఉండదు. ఇదివరకు ఎప్పుడూ ఉండలేదు. ఇక మీదట ఉండదు కూడా. పెన్సిల్‌లో గ్రాఫైట్, బంకమన్ను మిశ్రమం



ఉంటుంది. సీసం (లెడ్)లాగా వ్రాస్తుంది కాబట్టి 400 సంవత్సరాలకు పూర్వం గ్రాఫైట్‌ను కనిపెట్టినవారు పెన్సిల్‌ని లెడ్‌పెన్సిల్ అన్నారు.

అందరూ వాడే సాధారణ పెన్సిల్‌తో 56.3 కి.మీ.ల పొడవు గీత గీయవచ్చు. సగటున 45,000 మాటలు వ్రాయవచ్చు. దీనిని 17 సార్లు చెక్కుకోవచ్చు. చాలా దిట్టంగానూ, మృదువుగానూ ఉంటుంది కాబట్టి సీడర్ (Cedar) కర్రను పెన్సిళ్ళ తయారీకి ఉపయోగిస్తారు. ఈ సీడర్ వృక్షాలు 25 సంవత్సరాలైనా పెరిగినవిగా ఉండాలి. 100 సంవత్సరాలు పెరిగినవి చాలా శ్రేష్ఠమైనవి. మంచిరకం పెన్సిళ్ళకు పైన 8 పూతలు పెయింటు పెడతారు.

ప్రాచీన రోములో వ్రాయడానికి సన్నని బ్రష్ (కుంచె)లు వాడేవారు కాబట్టి ఆ అర్థం వచ్చే లాటిన్ పదం నుంచి పెన్సిల్ అనే పదం సార్థక మైంది. ఇప్పుడు అందరూ ఉపయోగించే ఆధునికమైన పెన్సిల్ 1564లో పుట్టింది. ఆ సంవత్సరంలో సంభవించిన ఒక పెద్దగాలివానకు ఇంగ్లండులో బ్రహ్మాండమైన ఓక్‌వృక్షం వ్రేళ్లతో క్రిందికి పడిపోయింది. అప్పుడు అక్కడ భూమిలో స్వచ్ఛమైన గ్రాఫైట్ కనిపించింది. దాంతో అక్కడ గొల్లవాళ్లు తమ గొర్రెలమీద గుర్తులు పెట్టుకునేవారు.

ప్రపంచంలో మిక్కిలి ప్రసిద్ధమైన పెన్సిల్ ఎబెర్‌హార్డ్ ఫేబర్స్ 'మంగోల్' 1894 లో ప్రవేశ పెట్టబడింది. సైబీరియాలో లభించే గ్రాఫైట్ మంచిది కాబట్టి మంగోల్ అనేపదం దీనికి వాడబడింది.

సామన్య జనం మొదలు జార్జి వాషింగ్‌టన్, అబ్రహాంలింకన్, థామస్ ఎడిసన్, సుప్రసిద్ధకవి ఆర్చ్‌బాల్డ్ మాక్లిష్ వంటి ప్రఖ్యాత పురుషులు అందరూ పెన్సిల్‌ను అభిమానించి వాడిన వారే. పెన్సిల్‌కింద చెరుపుకోడానికి చిన్నరబ్బరు ముక్క పెట్టడం అమెరికనుల కల్పన.

—'రొటేరియన్' సౌజన్యంతో

## భారతదేశంలో 10 లక్షల చిన్నతరహా సంస్థలు

*ప్రస్తుతం భారతదేశంలో చిన్నతరహా సంస్థలు 10 లక్షలు అని అంచనావేయబడింది. ఈ రంగంలో నేడు మొత్తం ఉత్పత్తుల విలువ రూ.40,000 కోట్లు చిన్నతరహా సంస్థలు సుమారు 2 కోట్లమందికి జీవనోపాధి కల్పిస్తున్నాయి.*

—'యోజనా' సౌజన్యంతో

"సత్యాన్ని అప్రియంగా పలుకరాదు. ప్రియమని అసత్యాన్ని పలుకరాదు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT

*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

